శ్రీ

# సంగీతవిష్ణులీలలు

అను

## దశావతారములు



మద్దూరి శ్రీరామమూర్తిగారిచే
రచింపఁబడియె.



పబ్లిషర్:

కొండపల్లి వీరవెంకయ్య,

బుక్ సెల్లరు, రాజమండ్రి.

రెండవకూర్పు 1000 ప్రతులు.



కాకినాడ.

కాకినాడముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

1927

[వ్యాఖ్యాసంకలితము]     [వెల 1—0—0

# పీఠిక.

భాషాభిమానులారా!

ఈవిష్ణులీల యనుదృశ్యప్రబంధమును మఱల నేను రచించుటకు నా కీమహానుభావుని లీలలయందున్న భక్తియే గాని వేఱొక్కకారణము లేదు. భారత, భాగవత, రామాయణకథ లెందఱెన్నివిధములుగా నెన్నిమారులు వ్రాసినను దనివితీరదు గదా ?

భక్తిపారవశ్యమున నీకథ గైకొని భాగవతములోని పద్యములే సాధ్యమైనంతవఱకు దీసికొని దొరకనిచోట్ల నాపద్యము లుంచితిని.

నాకు నాటకములు వ్రాయుట కిదియే ప్రథమప్రయత్నము. ఇందు లెక్కకు మిక్కుటంబగు స్ఖాలిత్యము లుండవచ్చును. ప్రాజ్ఞులు జూపించినచో ద్వితీయముద్రణమున సవరించుకొందును

12-2-27,<br>కాకినాడ.

ఇట్లు విన్నవించు భాషాభిమాని,<br>మద్దూరి శ్రీరామమూర్తి.

పరా: ఈ నాటకమందలి యాంకెలు అనుబంధములను చూపుచున్నవి. అంకెలున్న స్థలములందు నాయనుబంధమును పాడవలయును.

మద్దూరి శ్రీరామమూర్తి.

# ఈ నాటకమందలి పాత్రములు



**మత్స్యావతారము.**

సత్యవ్రతుఁడు
హయగ్రీవుఁడు
బ్రహ్మ
సరస్వతి
విష్ణువు
మత్స్యావతారవిష్ణువు

**కూర్మావతారము.**

ఇంద్రుఁడు
బృహస్పతి
వరుణుఁడు
కుబేరుఁడు
బ్రహ్మ
విష్ణువు
బలి
శంబరుఁడు.
కూర్మావతారవిష్ణువు
శంకరుఁడు
పార్వతి
జ్యేష్టాదేవి
జగన్మోహిని

**వరహావతారము.**

హిరణ్యాక్షుఁడు
నారదుఁడు
వరుణుఁడు
వరహావతారవిష్ణువు
బ్రహ్మ
ఇంద్రుఁడు.

**నరసింహావతారము.**

హిరణ్యకశ్యపుఁడు
లీలావతి
ప్రహ్లాదుఁడు
చండామార్కులు
కొందఱుబాలురు-పాములవాడు
సేవకులువత్తురు
నృసింహావతారము

**వామనావతారము.**

బలిచక్రవర్తి
శుక్రాచార్యులు
వామనుఁడు
రాణి
విశ్వరూపము విష్ణువు

**పరశురామావతారము**

కార్తవీర్యుఁడు
వీరసేనుఁడు
జమదగ్ని
పరశురాముఁడు
రేణుక

### రామావతారము.

రాముఁడు
లక్ష్మణుఁడు
సీత
శూర్పణఖ
రావణుఁడు
అంగదుఁడు
విభీషణుఁడు
మండోదరి

### కృష్ణావతారము.

చంపక
నీలవేణి
రాధ
యశోద
గోపాలుఁడు
బలరాముఁడు
శ్రీకృష్ణుఁడు
నలకూబరుఁడు
మణిగ్రీవుఁడు
నందాదులు
బ్రహ్మ
కాళీయుఁడు
నాగాంగనలు
అక్రూరుఁడు
కంసుఁడు

### బుద్ధావతారము.

ఇంద్రుఁడు
నారదుఁడు
బ్రహ్మ
శివుఁడు
మునులు
బుద్ధుఁడు
తారకాక్షుఁడు
కమలాక్షుఁడు
విద్యున్మాలి
విష్ణువు
లక్ష్మి





శ్రీ

# సంగీత విష్ణులీలలు.



## మత్స్యావతారము.



### ప్రథమరంగము.



కృతమాలికానదీతీరము.

[ప్రవేశము:—సత్యవ్రతుడు.]

సత్య — (బద్ధాంజలియై)

దండకము—శ్రీమన్మహాదేవ! దేవాదిదేవా! కృపాపూర్ణభావా! భవద్దాస వర్గోపతాపంబులం బాపగా నోపుదివ్యాత్మకా! మోక్షసంధాతయైయున్న లోకేశ! లోకోద్భవా! లోకపుంజంబు గల్పింపఁ బాలింపఁ దూలింపఁగాఁ బెక్కురూపంబులం బొందునీపాదపంకేరుహధ్యానపారీణుఁనై ఘోరసంసారవారాసిలోఁ బెక్కుకష్టంబులం బొందుచున్నాఁడ నీదివ్యరూపంబు జూపించిగాపాడవే భక్తచింతామణీ లోకరక్షామణీ దేవదేవా నమస్తే నమస్తేనమః.

నారాయణా! ఆర్తత్రాణపరాయణా! సచ్చిదానందరూపా! సత్సంకల్పా! సంసారసాగరమధ్యంబునఁ జిక్కియల్లాడుచున్న నన్ను రక్షింపుమా! పన్నగాధీశతల్పా!

అల్లదే ప్రభాకరోదయమైనది. నాయొనర్చినతపంబా నారాయణునకర్పించి గృహోన్ముఖుఁడ నయ్యెదఁగాక.

(జలముల గ్రహింపగా మీనుపిల్ల కాన్పించును. జలములవిడచి)
రమానాధచరణారవిందముల నాకెందంబున నిడుకొని విధివిధానంబున నప్పరమేశ్వరున కర్ఘ్యమొసంగ జలముల గ్రహించుచుండ నీశకులశాబకము నాయంజలిఁబడియె, నియ్యది యశుభసూచకమేమోగదా-

మీన— గీ. ఓనృపాగ్రిణి యిచ్చోట । నున్నయెడల
సమతమీనాళినను బట్టి । సంహరించు
సంచదలపోసి శరణార్థి । నౌచునీదు
యంజలింబడితిఁ గాపాడు । మనఘచరిత.

ఓ దవిళాధీశ్వర! శరణాగతత్రాణ బిరుదాంకుఁడవని తలంచి శరణార్థినై నీయంజలిఁబడిన నన్నుదయావిహీనుండవై జలంబుల విడిచితివి. ఇది నీబోంట్లకు న్యాయముగాదు.

సత్య—(ఆశ్చర్యమున) ఆశ్చర్యమాశ్చర్యము ! జలచరంబెక్కడ మనుజవచనంబుల బల్కుటెక్కడ ! పరికింపగానియ్యదొక గొప్పచిత్రమైయుండనోపును- ఎట్లైన నీశకుల శాబకంబును గాపాడుటయే కర్తవ్యము. అయినచో నీశకులమును గాపాడు టెట్లు- (ఆలోచింపుచుండును.)

మీన—రాజన్యమాజమణీ! ఆలోచించుచుంటివేల? నన్నురక్షింపుము. వేయిపల్కులవకాశమీయక- నామాటకెదురాడక- నన్ను రక్షింప బద్ధకంకణుఁడవుగమ్ము. మున్ముందు నాయుదంతంబునంతయు నెఱిఁగిన పిమ్మటధికతరామోదమందగలవు.

సత్య—(జలములతో మీనమును గ్రహించి) ఈ మీనుపిల్లను గొన్ని దినంబులవఱకు నాకమండలోదకమునం దుంచి కాపాడెదగాక. ఆహా! మృత్యువన్న ప్రతిజీవరాసికిని భయమేగదా ! (పరికించి మీనమునుజూచి) మఱియొకవింత- వింతపై- వింత- నాయంజలివడుటకుమున్ను కడుంగడు చిన్నదైన నీమీనమింతలోననే

నాదోయిలిపట్టనంతటి మెట్లుమయ్యెను- ఇంతగా వృద్ధిబొందుట కేమి హేతువోగదా! యిట్టిది- యున్నన్నడును కనివిని యెఱుగము. కానిమ్ము యీశకులశాబకమును నాకమండలమందుంచి గృహంబునకుఁ గొంపోయి యొకపెద్దపాత్రమున నుంచి కాపాడెదఁగాక (నిష్క్రమించును.)

## ద్వితీయరంగము.

సత్య —(తనలో) నదీతటంబునుండి గృహంబున కరుదెంచులోపలనె నాకమండలమంతయునాక్రమించుకొని-యందు-తనకు-స్వేచ్ఛగాఁ దిరుగుటకుఁ దగినంతస్థలము లేదని మొరపెట్టుటచే నీకూపమందుంచితిని. ఇచ్చోటనైన నామీనరాజంబున కిమ్ముగనుండెనో లేదో? (ప్రకాశముగ) ఓమీనరాజమా! సుఖముగానుంటివా! ఇచ్చట స్థలకుశలత్వము గలుగలేదుగదా ?

మీనము— రాజన్య చూడామణీ!

గీ. అల్పజలమున్న యీనూతి । యందునాకు
సుఖముగూర్పంగదగినంత । చోటులేదు
ఓనృపాలక యిచ్చోట । నుండజాల
గాన గొంపొమ్ము నదికి నన్ । కరుణతోడ.

సత్య —(ఆశ్చర్యమున) పట్టుమని పదిఘడియలైనగాకుండనే యొక్క-చిన్నిశకులశాబకమింత పెద్దనూయియైనం బట్టఁజాల నంతగాఁ వృద్ధిజెందుటఁ జూడ నెదో యద్భుతంబైన మాయగానున్నది.

[తెరలో]

ఓ నృపాలచూడామణీ! ఈ మీనరాజంబును సామాన్యమట్లు దలంపకుము. కొండొక కార్యార్థమై శ్రీమహావిష్ణు వీరూపంబున

నవతరించెనని యెఱుంగుము. నేటి దివసంబాది సప్తదివసంబులకుం జతురాననునకొక్కపగలు నిండును. అప్పుడు సమస్తలోకములు ప్రళయసంద్రమున మునుంగంగలవు. ఆప్రళయంబున భక్తాగ్రగణ్యుండవగు నిన్ను గాపాడుటకే నీకిమ్మహాత్ముండు దర్శనమొసంగెను. నేటి కారవదినంబున సప్తమహాఋషులతోనున్న యొక్క చిన్నినావ యాకృతమాలి కాతీరంబున కరుదెంచును. నీవును నాపంపున సమస్తౌషధీలతా బీజములతో నానౌక నధిష్ఠింపుము. ప్రళయకాలమందలి పెంజీకటివల్లబాధలేకుండ సప్తమహాఋషుల తేజంబు నిన్నా మీంనావను గాపాడుచుండును. ప్రళయవారాసియందు నౌక మునుంగకుండునట్లీ మహామీన మద్దానిని తనకొమ్మున నిల్పియుంచును. ప్రళయపవనంబువలన బాధలేకుండనొక్క పన్నగం బద్దానిని బ్రమింగి మిమ్ము రక్షింపగలదు. కాన గాబోవుసంగతుల గుర్తెఱింగి యీమీన ముపదేశించి నట్లొనర్పుము.

సత్య—ధన్యోస్మి! ధన్యోస్మి!! ఏమినాభాగ్యము. (1)

సీ. సంసారమనుమహా । సాగరంబునజిక్కి
పలుపాట్లు పడుచుండు । ప్రజలకైన
భక్తాగ్రగణ్యులం । బరికించిభక్తితో
నతులొనరించువై । ష్ణవులకైన
కర్మవిసర్జించి । మర్మంబుదెలసితి
మంచుందిరిగెడి స । న్యాసులైన
యనవరతంబు ని । న్నరయంగదలపోసి
వనములనివసించు । మునులకైన
చేతులారంగ భక్తితో । సేవసేయు
భాగ్యమలవడకుండెనా । భాగ్యమేమొ

పద్మనాభుని సేవించు । పదవిదొఱకె
ధన్యుఁడనునైతి కులమెల్ల । ధన్యమయ్యె.

ఈమీనరాజును నాకృతమాలి కానదియందు విడచివచ్చెదగాక.

(నిష్క్రమించును.)

తెర పడును.



తృతీయరంగము.

[ప్రవేశము: — హయగ్రీవుఁడు.]

హయ — (తనలో) సవతితల్లిబిడ్డలుమని మమ్మాసడించి స్వర్గీయసౌఖ్యములలోఁ భాగ్యానసీయక వేదబాహ్యులమని దూరముగా తరిమినైచిరి. ఆవేదములు మాకడలేవని - యావేదములను మేము జదువలేదని - జన్నములలోని హవిర్భాగములనీయక తామే యనుభవించుచుండిరి. మమ్మిట్లు మోసమొనరించి మాపట్టున నింతనూరులైయున్న వీరల మోసముచేతనే వంచింపవలయును. వేదముల నాగ్గింటిని సంగ్రహించుకొని పారిపోయెదగాక. (నలుదెసలు కలయజూచి) ఏమిది - యితలోననే యింతచీకటికగ్రమ్ముకొనుట కేమిహేతువోగదా. అదే ఆదెసగూడ కారుచీకటిచే నావరింపబడినదే - (ముందునకుఁజూచి) అల్లదే యీపక్క నొక్కదివ్యతేజంబు మాడ్కి నదో మెరయుచున్నది. (సమీపించి) ఎదోయనుకొంటిని. బ్రహ్మగారి దివ్యతేజము (యింకనుసమీపించి) అదే భారతిగూడ యాతనిప్రక్కనే శయనించియున్నది. వీరితీరుజూడ నిద్రించుచున్నట్లున్నది. మంచిసమయమే లభించినది. ఇంక వేదములు లభించినవనుమాటయే. ఆహా! వేదములే లభించిన నాయదృష్టము గొనియాడదరమె-

సీ. కర్మరాహిత్యుని । మర్మంబుబోధించు
వేదముల్ నాచేత । వెలయునపుడు
సర్వోత్తమజ్ఞాన । సంధాయకములైన
వేదముల్ నాచేత । వెలయునపుడు
అమరులగర్వంబు । హరియింపఁజాలెడి
వేదముల్ నాచేత । వెలయునపుడు
అఖిలసౌఖ్యంబుల । కాధారభూతమౌ
వేదముల్ నాచేత । వెలయునపుడు
అమరనాయకు సిగఁబట్టి । యవనికీడ్చి
సంపదలపుట్టినిల్లనఁ । జాలునట్టి
త్రిదివసామ్రాజ్యమేలెడి । పదవిగనుట
కేమియభ్యంతరంబుండు । నింకనాకు.

(పరిక్రమించి) వేదములా చతురాస్యుని నిశ్వాసవాయువులతోడ వెలికనుదెంచుచున్నవి. వీనిని సంగ్రహించి రసాతలమునందు ప్రస్తుతము వీనినిదాచి యుంచెదను. (వేదములసంగ్రహించికొని పారిపోవును.)

(వేదములు తెరలో) కమలసంభవా! రక్షింపు రక్షింపుము. మమ్మీ దురాత్ముఁడు గొనిపోవుచున్నాఁడు.

బ్రహ్మ—(మేలుకాంచి) చిరకాలంబునుండి యింతకంతమైన విశ్రాంతిదీసికొనక పనిచేసి నేఁడించుక కనుమూసిన నన్నెవ్వరోరక్షింపురక్షింపుమని పిలుచుచున్నారు. ఎవ్వరా పిలుచువారు-

వేదములు—కమలసంభవా! వేదముల నాల్గింటిని నిద్దురాత్ముఁడు దొంగిలించుకొని పోవుచున్నాఁడు.

బ్రహ్మ—దేవీ! లెమ్ము లెమ్ము. వేదములనెవ్వఁడో తస్కరించుకొని పోవుచున్నాఁడు. లెమ్ము. (వాణినిలేపును.)

సర—నాథా! ఏమది. ఒక్కసురాత్ముఁడు వేదములఁ గొంచుబోయె నా! ముల్లోకంబులు ప్రళయసముద్రమున మునింగియుండ నీగ్ర వ్యాదు డెట్లుజీవించి యిచ్చోటికరుదెంచియుండెను- తమదివ్య దృష్టినిజూడుడు. వాఁడెవ్వఁడో ముమ్ముందుగాఁ దెలసికొనుఁడు.

బ్రహ్మ—(దివ్యదృష్టి నభినయించి) దేవీ! సోమకాసురుండను రక్క సాధముడీ యకృత్య మొనరించెను. మనము నిద్రింపకయము న్న బ్రహ్మలోకము ప్రవేశించుటఁజేసి వాఁడు ప్రళయంబున నశింపక మనము నిద్రించుచుండఁ దరిలభించినదని వేదముల సంగ్రహించినాఁడు.

సర—నాథా! యిప్పుడు కర్తవ్యమేమి?

బ్రహ్మ—కర్తవ్యమునకేమున్నది- లోకరక్షకుఁడైన యాదినారాయ ణునిఁ బ్రార్థింపవలయును.

ఉ. వేదపురాణపూరుష వి / వేక మొకింతయు లేక యెవ్వఁడో
నా దరిజేరి వేదముల / నాల్గిటిఁగైకొని పారిపోయె; నా
వేదచయంబు దొంగిలిన / వీరునిబట్టి వధించిమాదు మ
ర్యాదనునిల్పుమయ్య సిగ / మంబులబ్రోవగదయ్య మాధవా!

(తెరలో) కమలాసనా! చింతింపకుము. ముందిట్లురాగలదని భావించి యే ప్రళయసముద్రంబున మత్స్యంబనైయుంటిని. సముద్రతీ రంబునకురమ్ము. ఆచ్చోట వేదముల నీకొసంగెదను.

బ్రహ్మ—మహాప్రసాదము. దేవీ! రమ్ము. దేవదేవుఁడుపదేశించినట్లు చేయుటయే కర్తవ్యముగదా?

సర—చిత్తము. (నిష్క్రమింతురు.)

(తెరపడును.)

---

## తురీయరంగము.

[ప్రవేశము:—హాయగ్రీవుఁడు.

**హాయ**—ఇప్పటికిఁగదా! నాకోర్కె నీడేర్చుకొంటిని. కష్టించి ప్రయత్నించినచో కార్యసాఫల్యము గాకుండునా! కార్యసాఫల్యము మనము చేయు ప్రయత్నమును బట్టియేగదాయుండును. ఇంక నీవేదముల సాంగముగా జదివిచూచెదగాక. (అనివిప్పుచుండ)

**వేదములు** —నారాయణా! ఈమ్రుక్కడిరాక్షసాధముని నుక్కడగించి మమ్ముగాపాడి లోకములఁబ్రోవుము.

**హాయ** —దానవారియగు నా నారాయణునిఁగూర్చి యీవేదములు మొరలిడుచున్నవి. ఇంచుక విప్పినంతనే యల్లరిచేయుచున్నవి గాన వీనినోళ్ళను కట్టివేయించి రసాతలమునకుం గొనిపోయెదను. (అనిమరల గట్టిగాఁగట్టును)

(తననీడఁజూచి భ్రమసి) అయ్యో! యిదేమున్నది. మాపాలిటి కాలుఁడనఁదగు నా విష్ణువే నాకడనుండి యీనిగమంబుల బలిమినైనఁ గైకొనఁగోరిగాబోలును వచ్చినాడు. నామేనప్రాణము లుండఁగా నీవేదముల నీతనికర్పింతునా! కలలోనివార్త. వానికండ్లలో నెట్లోదుమ్ముగొట్టి పారిపోయెదగాక. (పరుగిడును.)

[పునఃప్రవేశము:—హాయగ్రీవుఁడు.]

**హాయ**—(నలువంకలఁజూచి) అయ్యయో యూరక భ్రమజెందితిని. ఎవ్వడును గానరాడు.

(తెరలో) పాపీ యింకెందుబోయెదవురా!

వేదసంరక్షణార్థమా విష్ణుండు పట్టువీడక వచ్చుచుండెను గావలయును గాని వాయువేగమనోవేగంబుల బరువిడగల నన్నుఁగలసికొనగలఁడా కల్ల కల్ల! అయినను- రాబోవు నాపదఁదప్పించుకొనుట

కిప్పటినుండియే యత్నముసేయవలయును గాన యిక్కడనుండి యే-నాకాళ్ళకు బుద్ధిసెప్పి పరుగులిడెదగాక. (నిష్క్ర-)

[ప్రవేశము:—నారాయణుఁడు.]

నారా—ఓరీ! రాక్షసకులార్ణవబడబానలా! నిలునిలు. ఇంకెందు పోగలవురాదుర్మతీ! వాణీమనోహరుండు నిద్రనుండు తరి వేదముల సంగ్రహించి పారిపోవుచుంటివా? నిలునిలు!!నిగమంబుల తస్కరించిన నిన్ను మున్ముంగ జక్కాడి ముందు లోకులెవ్వరు-నిట్లు మతిమాలి వర్తింపకుండునట్లొనర్చెదను. (యించుకదూరమేగును.)

(తెరలో)

వేదము—నారాయణా! నారాయణా! మమ్ముగాపాడవా! భక్తలోకమందారా! రక్షింపుము. రక్షింపుము.

నారా—(వెనుకకుదిరిగి) అల్లదే! ఆడబోయిన తీర్థమెదురైనట్లు లా దురాత్ముఁడీవంకకే వచ్చుచున్నాడు. రానిమ్ము. (వెనుకకొదగియుండును.)

[ప్రవేశము:—హాయగ్రీవుఁడు.]

హయ—అబ్బా! యెంతప్రయాసపడవలసివచ్చినది. మిట్టుపల్లంబులనక-రాలురప్పలనక-ముండ్లుగిండ్లనక- యేకబిగిని పెక్కునక్కజిక్కులం బరువిడి యాతనికంట దుమ్ముగొట్టి యిట్లురుదెంచితిని. మాటిమాటికి వేదములా నారాయణుని బ్రార్థించుటచే నాతఁడెప్పుడువచ్చునో-యని భీతిజనించుచున్నది. ఆ-భీతి యేమి! ఎవ్వడడ్డంబువచ్చినను వాని జక్కాడి పిమ్మట నేరసాతలమున కేగెదగాక.

కాని యీనారాయణుని చర్యలలోఁ గొన్ని నాకుఁ గిట్టవు. సోదరులమే-యిర్వురతల్లులుటలయందొక్క జనకునకు జన్మించినవారమే-

యట్టిమాలో భేదంబుల గల్పించి- మాసోదరుల కలహములందుఁ జొచ్చి యొకరుని రక్షించి రెండవవానిఁ జక్కాడును.

గీ. అన్నదమ్ముల కలహము । లందుఁజొచ్చి
కాకులను జంపి గ్రద్దల । సాఁకునటుల
యుక్కరుని జంపి రాజ్యమిం । కొకరి కిచ్చి
సాఁకుచుండుట యాతని । సహజగుణము.

ఇట్టికార్యములలో నిష్కారణముగాఁ బ్రవేశము గల్గించుకొని యేవో లేనిపోని నేరములు మాపై నారోపించి దూరుచుండును. (ముందునకు జూచి తనలో) అయ్యో యెవ్వని బాఁటిపడకుండఁ బారిపోవఁజూచితినో యాతని కట్టెదుటికే వచ్చితినే? యింకేమిదారి? భీతిమై పులిగుహం బ్రవేశించు ఛాగశాబకమునైతినే. యాతనితోఁ బోరాడుట దప్పదని తోఁచుచున్నది.

విష్ణు—వేదాపహారీ! హయగ్రీవా! నా బాఁటి పడకుండ నీవెందేగఁ గలవు-నా సహజగుణ మెఱిఁగియు నిట్టి యకార్యమున కేల మూఢుఁడవై సిద్ధపడితివి.

హయ—ఏలనా! యిప్పుడు నీకు పరాజయము జేకూర్చుటకే. తెలసినదా! వేదాపహారీ! యంటివయ్యది తప్పు- బ్రహ్మసృష్టిలోనివారమైన మేముఁగూడ వేదములఁ జదివి వానివలన నుపయోగము బడయవచ్చును గాన నేనా వేదంబుల గైకొంటిని యిందాక్షేపణ మేమున్నది. ఈవేదముల జదువని వారమగుటచే తనే గదా యజ్ఞములలోని హవిర్భాగములు మాకీయక దేవతలే యనుభవించుచుండిరి.

నా—ఓరీ! దురాత్మా! వేదబాహ్యులగుటకు మీప్రవర్తనమే కారణము. జన్నములలోని హవిర్భాగములఁ గొనుటకు మీరెందుల కనర్హులైతిరో యెఱిఁగింతు నాలింపుము.

సీ. జపతపోహోమాది । సత్కర్మలనువీడి
యీరీతి మీరు వ । ర్తించుకతన
కారుణ్యమొక్కింత । గలనైన దలంపక
హింపసేయగ నడు । గిడుటకతన
సత్యమే మరచి య । సత్యమే మనకెందు
బూర్ణలాభంబని । మురియుకతన
పరలోక మనుమాట । భావింపబోవక
యిహలోక సుఖము కాం । క్షించుకతన
చేయరానట్టి పాపముల్ । సేయుకతన
నడువగా రానిపథముల । నడచుకతన
కర్మభూమిష్టమైన యా । గములలోని
హవ్యములు గొనమీరర । నర్హులైరి.

దురాత్మా నీసందియము తీరినదా! యికనిన్ను జక్కాడి లోకంబులకు నీతిసెప్పెదగాక.

హాయ — ఓరీ! యెంతపెద్దయుపన్యాస మొనరించితివి. చాలుచాలునిక నూరకొనుము. రమ్ము! నిన్నుజక్కాడినపిమ్మట నే వేదముల రసాతలమునకు గొంపోయెదగాక. (యుద్ధముచేయుదురు.)

హాయ — (తనలో) అబ్బా యీతనితో బోరొనరించుట కడుంగడు గష్టముగా దోచుచున్నది. ఈ వేదములీతని పాలబడకుండ జేయవలసియున్నదికదా.

(మరల యుద్ధముచేయుచు పరుగిడును.)

విష్ణు — ఓరి! దురాత్మా! సముద్రము జొచ్చిననిన్ను నెవ్వాడ లేనని యే దలంచితివా ! సర్వవ్యాపకుండనైన నా బారిపడకుండ నీవెందే గగలవు. పొమ్ము. జలధిలోన నేమరణింపుము.(నిష్క్రమింతురు)

తెరయెత్తగా

మత్స్యావతారవిష్ణువు.

ప్రవేశము:—సత్యవ్రతుఁడు-బ్రహ్మాదులు.

సత్య—పన్నగాధీశతల్పా! సత్సంకల్పా! భవద్దివ్యసందర్శనంబున కడుం గడు గృతార్థుడనైతిని. సర్వకాలసర్వావస్థల తమ్మోడఁబాయకుండు నట్లనుగ్రహింపుఁడు. నాప్రణామశతంబును గొనుఁడు.

మత్స్యావ—కమలాసనా! ఈవేదచతుష్టయముంగొని లోకంబుల యథాప్రకారము సృష్టింపుము. సత్యవ్రతా! నీభక్తికేనెంతయు సంతసించితిని, నాసాయుజ్య మొసంగితిని, రమ్ము.

అందఱు—మహద్భాగ్యము.

తెరవ్రాలును.





శ్రీ

# సంగీతనిష్ఠలీలలు



## కూర్మావతారము



[ప్రవేశము:—ఇంద్రుఁడు, బృహస్పతి, వరుణుఁడు మున్నగువారు]

ఇంద్రుఁడు—గురూత్తమా! కూర్మరాక్షసుల దారుణబాధల కోర్చి యిట్లెంతకాలమని మనియుండగలము. దీనికిఁదగిన ప్రతీకారమే మియును లేదా ?

బృహ—శచీంద్రా! నాఁడా దూర్వాసుఁడొసంగిన శాపవశంబున లోకంబులు ధనహీనంబులయ్యె! యయ్యదికారణంబుగ భూలోకంబున యజ్ఞయాగాదికర్మ లుడుగంబడెను. ఎక్కడనైనజన్నము జరుగుచుండెనని తెలియవచ్చినంతనే ముష్కరులగు రాక్షసాధములు వానికి విఘ్నమాపాదించి మన కుపవాసంబులఁ గల్పించుచున్నారు.

వరు—ఇట్టి దుష్కార్యము లొనరింప సాహసించిన యీదురాత్ములు దిక్పాలురఁ గూడ నిర్జింపఁదలంతురేమో యను సందియ ముదయించుచున్నది.

ఇంద్ర—అయ్యదియే నాభయకారణము. ఎప్పుడెవ్వఁడు దండెత్తివచ్చునో యని తత్తరిల్లుచునే యుంటిని. ఛీఛీ! యింద్రత్వమువలన నాకిసుమంతయైన సుఖములేదు. దినదినగండము నూరేండ్లాయువని నట్లున్నది నాబ్రతుకు. ఇప్పటికీకష్టములు దీరెగదా

యని సంతసించుచుండ మరల నెవ్వడో యొక్కరుక్కడిరా
క్షసాధముఁడు-పరమేష్ఠిచేతనో వరంబులబడసి-యీస్వర్గము
పై దండెత్తును—గురువరా! యిందుల కేమైన సాధనమున్న
చో దెల్పుము.

బృహ—లోకములన్నియు నిట్లు సంక్షోభమొందుచుండ నాకమలా
సనాదులు జూచి యూరకుందురా! వారలుగూడ దగిన ప్రతీ
కార మొనర్పవలయుననియే చూచుచుందురు.

ఇంద్రు—పరమేష్ఠియొద్ద కెవ్వనినైన బంపినచో—

బృహ—నేనీవల కీవిషయమునుగూర్చి నాలోచించి చతురాననుని
దోడ్కొనిరమ్మని చిత్రరథుని బంపియుంటిని.

[ప్రవేశము:—కుబేరుఁడు]

కుబే—శచీంద్రా! దానవులెల్లరును బలీంద్రుని దమయధిపతిగా నెన్ను
దిగ్విజయార్థము నాకలోకమున కరుదెంచుచుండెనని నారదు
లచే నిప్పుడె వింటిని.

ఇంద్రు—మిత్రమా! ఆయాసనమలంకరింపుము! గురువరేణ్యా! మన
మనుకొనినట్లుగా దానవులు స్వర్గమును జయించుట కరుదెం
చుచుండిరి. ఇప్పట్టున మనమాచరింపవలసిన దెద్దియో గోచ
రించుటలేదు.

[ప్రవేశము: బ్రహ్మ]

ఇంద్రు—(సింహాసనమిడి) వాణీమనోహరా! మంచిసమయమునకే
యరుదెంచిరి. దానవుల బోకార్చి లోకంబులఁ గాపాడుటకు
సుకరంబైన మార్గమొక్కటుపదేశింపుము

బ్రహ్మ—దేవాదిదేవుండగు నారాయణుఁడే యందులకుఁ దగినప్రతీ
కార మారయవలయును.

వరుణు—వికుంఠమునకేగినచో గొంతలాభకారిగా నుండునేమో.

బ్రహ్మ—వలదు. వలదు.

గీ. ఆదిదేవుని సన్నిధి । కరిగినంత
దనుజుఁడెవఁడేని సేనతోఁ । దరలివచ్చి
యమరపురిపైనవిడిసి ప । రాక్రమించి
నపుడు వారలగెలువఁగా । నగునెమనకు.

బృహ—అయ్యదిగూడ నాలోచింపవలసిన విషయమే! నేడో రేపో దనుజులీ నాకమును సమీపింపగలరని తోఁచుచున్నది.

బ్రహ్మ శచీంద్రా! సర్వవ్యాపకుండగు యానారాయణు నిచ్చోట నుండియే ప్రార్థింతము.

ఇంద్రు చిత్రము. (ప్రార్థింతురు) (21)

ఇంద్రాదులు—

ఉ. ఓకమలాక్ష యోవరద । యోదనుజాంతక! కూర్మ రాక్షసా
నీకము దేవతానగరు । నేడెగ్రహింపఁగ వచ్చుచుండె; మే
మేకరణిన్ జన దగునో । యెట్లుజయంబును గాంచువారమో
నాకముగాచు టెట్లొ జ । నార్దన మా కెఱుఁగంగజేయవే.

వరు—గీ. నాటి దూర్వాసుశాపమీ । నాడుమమ్ము
పట్టి పల్లార్చుచుండెనో । పరమపురుష
భవ్య భవదీయ దివ్య కృ । పారసంబు
కొంతమాపైన బరపి చే । కొనుముదేవ!

[ప్రవేశము:—విష్ణువు]

వి—చతురాననా! దిక్పాలురులారా!

గీ. కాలవశమున కోర్చి ది । క్పాలులార
యుబ్బి చెలరేగి దిరుగాడు । చున్నదనుజ

సంతతుల బలమునుగూల్చు । నంతవఱకు
వారితో మైత్రిచేయగా । వలయునిపుడు.

శచీంద్రా !

చ. పటుతర బాహువిక్రమము । పారముగాఁగలదానవేశ్వరుల్
కుటిలతనంబు చూప ది । గుల్ వడ నేలసహింపుమయ్య నీ
యటమటలెల్లదీరువఱ ? కాదనుజాళిఁగూడి మీరు దు
ర్ఘటమని యెంచబోవక ద । గన్ మథియింపుడు పాలసంద్రమున్.

దనుజాధములతోఁగూడి నానానేక యోషధీలతల సంపాదించి పాల సముద్రమున నైచి మంధరక ధరమును కవ్వముగ జేసి వాసుకి యనుమహానాగును తరిత్రాడుచేసి మథించిన జరామరణముల జయించు యమృత ముందుద్భవింపగలదు. ఆయమృతపానమున మీరు బలసంపన్నులై దనుజాధముల నిర్జింపగలరు- కార్యసాధనకడంగుఁడు. (అంతర్ధానమగును.)

బ్రహ్మ-- నారాయణదేవుఁ డుపదేశించినట్లొనరించుడు- శచీంద్రా! నేనింక సత్యలోకమునకేగెదను. (నిష్క్రమించును.)

ఇంద్రు—గురువరా ! పెక్కుకష్టంబుల కోర్చి యమృతమును సంపాదించినను యామ్రుక్కడిరక్కసులు మనకడనుండి యయ్యమృతమును బలిమినిఁ గైకొనిన మన మొనర్పఁగలదేమున్నది.

బృ- ఇందుల కాలోచింపవలసినపనిలేదు. శ్రీహరి యెట్లులో మనకమృతమునొసఁగి రాక్షసులకు సున్నజుట్టును. సందేహింపకుము.

(తెరలో కలకలము.)

ఇంద్రు—(ఆలించి) ఆకలకలధ్వనులేల యుత్పత్తిల్లియుండును.

కుబే—రాక్షసాగమనము సూచించు మనవారి కేకలైయుండనోపు.

[తెరలో] త్రిభువనసామ్రాజ్యలక్ష్మీ దురంధరుండనను గర్వముపెంపున కన్ను మిన్నుగానని యాశచీంద్రుడేడీ!

ఇంద్రు—గురువరా! కర్తవ్యము కర్తవ్యము.

బృహ—కర్తవ్యమున కేమున్నది. కయ్యమామని వారలతో నెయ్యంబుననుండుమనిగదా నారాయణదేవుండుపదేశించెను. అట్లొనర్చుటయే ముఖ్యకర్తవ్యము- కాన నీవు ప్రస్తుతము వైరము నుమరచి- యాబలీంద్రునకెదురేగి దోడ్కొనివచ్చి పీఠమిడి యాదరింపుము.

(ఇంద్రుండు నిష్క్రమించి బలిశంబరులతో ప్రవేశించును.)

ఇంద్రు—సోదరా! దానవసార్వభౌమా! ఆయాసనమలంకరించి నన్ను కృతార్థుజేయుండు.

బలి—ఇంద్రా! యీనక్కవినయము లెక్కడనేర్చుకొంటివి. ఇట్లు నటించుమని నీకెవ్వరుబోధించిరి.

శంబరు—సార్వభౌమా! అందినజుట్టును నందకున్న గాళ్ళనుబట్టుకొను స్వభావముగల యీదేవతులు జిత్తులమారులు. అట్టివీరొకనికడ నీవిద్య నేర్చుకొనక్కరలేదు.

బలి—ఇంద్రా! యీనక్కవినయముల పోవిడచి ప్రస్తుతాంశమును వినుము. స్వర్గీయసౌఖ్యముల చాలకాల మనుభవించితి విం కనించుకంత విశ్రాంతిదీసికొనుము. నీయనుంగు తమ్ములమైన మాపై నీస్వర్గరాజ్య రమామణిని విడచి యెచ్చోటికైన బొమ్ము. అట్లొనర్పకున్న నిను రణరంగంబునజక్కాడి విజయలక్ష్మితో నీ స్వర్గరాజ్యలక్ష్మినిఁగూడఁ జేకొందును.

ఇంద్రు—సోదరా! సకలకష్టంబుల కాకరంబైన యీస్వర్గరాజ్యము విడవవలయుననియే దలంచుచున్నాను గాని,

బలి—హాంసపాదు లనవసరంబు- నీకానీల-విడచి- నీచేజేతల నాకుఁ బట్టాభిషేక మొనరించి తక్షణమే వెడలిపొమ్ము.

వరు—అగ్రసోదరతుల్యుండవగు నీకీతఁడా పట్టాభిషేక మొనరించుట లోకులువిన్న నవ్వరా!

శంబ—శచీంద్రా! బలీంద్రుడీ స్వర్గమేలుటకు సమ్మతింతువా!

బృహ—బలీంద్రా! శంబరా!! నావాక్యములాలింపుడు. పలుకష్టంబులతోఁగూడిన యీరాజ్యభారమును తమభుజములపైఁ బడవేయనేలయని సందేహించుచున్నాడు. ఈతడెప్పుడును దేవదానవుల క్షేమమును కాంక్షింపుచుండును కాని

శంబ—కాని యనుచుంటివేమి

బృహ—ఇంతవఱకయ్యది నెరవేరలేదు.

శంబ—ఇంతటినుండి కలుగును. రాజ్యమును మాకువదలినచో స్నేహభావముతోడనే యుండవచ్చును.

ఇంద్ర—అయ్యది సరికాదు. దేవదానవులని భేదములేకుండునట్లును మనకెల్లరకును జరామరణరాహిత్యముఁ జేకూర్చు దివ్యామృతమును సంపాదించుమార్గ మొక్కటిగలదు.

బలి—(తనలో) ఆదివ్యామృతమునుగూడ సంపాదింపవలసినదే- (ప్రకాశముగ) పురందరా ఆమార్గ మనుసరించుటకు దానవులందఱును సిద్ధముగానుండిరి. గాని యాయమృతమును సంపాదించుటెట్లు?

బృహ—ఇప్పటికే కాలమతిక్రమించినది! భోజనాదిక్రియల నిర్వర్తించికొనినపిదప నెల్లసంగతుల ముచ్చటించుకొనవచ్చును రండు

(నిష్క్రమింతురు.) (తెరవ్రాలును.)

క్షీరసాగరతీరము.

కూర్మావతారము. ద్వితీయరంగము.

[ప్రవేశముః—ఇంద్రాదులొకవంకను, బలిశంబరాదులొకవంకను.]

బలి—పురందరా! కార్యము విఘ్నమైనది. మాపడినశ్రమవ్యర్థమైనది.

బూడిదనుబోసిన పన్నీరయినది. యింకేమున్నది. తుచ్ఛులగు దేవతల మాటలునమ్మి మోసపోయితిమి!

శంబరు — ఇంద్రా! ఇందులకేమేని ప్రతీకారమున్నదా! లేక నోరు మూసికొని యూరకేగుటయా

ఇంద్రు — దానవసార్వభౌమా! తత్తరపాటుజెంది యూరక మమ్ముల నిందింపకుము. మనకిట్టిమార్గ ముపదేశించిన యా యిందిరా రమణుని ప్రార్థించిన ప్రసన్నుండై యేదేని కార్యసాధనోపాయ మెఱింగించితీరును.

బలి — అట్లనే కానిండు.

(అందఱు ప్రార్థింతురు. 3)

బలి —

శా. ఓరాజీవదళాక్ష మంధరము పా । థోరాశిలో మున్గెనీ
కారుణ్యం బిసుమంతజూపి; యెటులో । కార్యంబు సాధింపగా
మారాముఁల్ వడుచున్న మమ్ముగుణధా ' మాబ్రోవగా నేడు నీ
వే రాకున్నను దిక్కు మాకెవరు లో । కేశా కృపంజూడుమీ!

[ప్రవేశము:— విష్ణువు]

విష్ణు — దేవేంద్రాదులారా! దానవేశ్వరులారా! వెరువకుఁడు. వెరువకుఁడు. కూర్మావతారమెత్తి యీమంధరమును పైకిదేల్చెదను. పట్టుదలవీడక కార్యసాధనకై గడంగుఁడు. (నిష్క్రమి)

బ్రహ్మ — మహానుభావా! ఆదినారాయణా! మున్ను సోమకాసుర సంహారసమయమున మత్స్యావతారరూపమును జూపి మమ్మానందింపజేసినట్లు కూర్మావతారరూపసందర్శన మొసంగి మమ్ముల చరితార్థులఁజేయవే.

(ధ్వనితో తెరలేచును)

(కూర్మావతారస్వరూపము.)

బ్రహ్మ—ధన్యోస్మి ! ధన్యోస్మి !! (అందఱునమస్కరింతురు.)

(కూర్మావతార మంతర్ధానమగును.)

బలి—(నిర్ఘాంతపడి చూచుచు) శచీంద్రా! మంధరము సముద్రము నుండి లేచినది. మరల తరుచుట కారంభింతమా!

ఇంద్రు—అట్లనే యొనర్తము.

(సముద్రమునుమథింప హాలహాలము పుట్టును.)

బలి—ఇంద్రా! యిదేమి? పెనుమంటలతో లోకమును భస్మీపటల మొనర్చుచున్నది.

(తెరలో) దేవదానవులారా! వెరువకుఁడు. ఆయుద్భవించినది హాలాహాలము. అద్దానిని శాంతింపఁజేయుమం వెంటనే యీశ్వరునిఁ బ్రార్థించుఁడు లేకున్నచో హాలాహాలము వలన లోకములన్నియుఁ గాలి భస్మీపటలములు గాఁగలవు.

బలి—ఇంద్రా! కర్తవ్యము వింటివా. అట్లొనర్తమా!

బ్రహ్మ—శంకరా! భక్తవశంకరా! హాలహాలము వలన లోకములు భస్మీపటములగుచున్నవి కాపాడుమా!

ఇంద్రు—పరమేశ్వరా!

కం. నీకంటె నొండెఱుంగను
నీకంటెం బరులుగాన । నేరరుజగముల్
నీకంటె నొడయఁ డెవ్వఁడు
లోకంబుల కెల్ల నిఖిల । లోకస్తుత్యా!

మత్తకోకిల. బాహుశక్తిసురాసురుల్ సని । పాలవెల్లి మథింప హా
లాహాలంబు జనించె నేరిక । లంఘ్యమె భువనంబు గో
లాహాలంబుగఁ జేసి చిచ్చును । లాగముంగొని ప్రాణిసం
దోహముఁ బ్రిదికింపవే దయ । దొంగలింపగనీశ్వరా.

బలి—చిరశుభాకారా! పార్వతీచిత్తచోరా! నీవుగాకున్న మాకింక దిక్కెవ్వరు.

[ప్రవేశము:—పార్వతీపరమేశ్వరులు.]

శంక—దేవదానవులారా! భయమొందకుడు. నీ హాలాహలమును భక్షించి మీయాటమటలెల్ల క్షణములోఁ దీర్చెదను (పార్వతి వైపునకుఁ దిరిగి)

క. శిక్షింతు హాలహాలమును
భక్షింతును మధురసూక్ష్మ! ఫలరసముక్రియన్
రక్షింతు ప్రాణికోట్లను
వీక్షింపుము నీవు నేను! వికచాబ్జముఖీ!

(హాలాహలమును బక్షించి) సురాసురులారా! మీకోరినట్లే హాలాహలము న్నణచితి నింకసుఖశాంతులకై పట్టుదలతో యత్నింపుము.

[ప్రవేశము:—జ్యేష్టాదేవి.]

జ్యేష్టా—క్షీరసాగరునిలో గర్భమం దుద్భవించిన నేను నివసింపదగిన తావులును నాచేయుకృత్యములను నెఱుంగజేయరే!

బ్రహ్మ—(తనలో) ఏమీ వికృతాకారము (ప్రకాశముగ) ఓముద్దుగుమ్మా! దబ్బరలాడుచు దత్తంబైన ధనంబు లపహరించి మధుపానాశక్తులై యుండువాండ్రును మధుసేవాపరాయణులై జూదదేవి నాశ్రయించి యొడలెఱుఁగక యిల్లువాకిళ్ళ నమ్మువాండ్రును చరణంబులైన గడుగక జపతపోహోమాదికార్యంబుల నిర్వర్తించు డాంబికులును- సంజకెంజాయలందు నిద్రిసలుపువాండ్రును- అరిషడ్వర్గపీడితులై- కులాచారధర్మముల మరచి వర్తించువాండ్రును- దురాచారసంపర్కులైనవాండ్రును నీకు నమ్మినబంట్లుగా నుందురు. ప్రొద్దెక్కి మేల్కాంచు ముద్దరాండ్రను- విభులతో జగడించువాండ్రను- దురాచార

సొంపున్కైన జవరాండ్రును- పతిభక్తినంచించి చెడి జారిణు
లై మత్తిల్లి దిరుగు తలిరుబోండ్లును- కారణం బిసుమంతయు
లేకయిరుగిండ్లకుఁ బొరుగిండ్లకుఁ బోవువాండ్రును- భర్త
భుజింపకమున్న భుజించు గయ్యాండ్రును- పిలిచికయ్యములా
డు వాండ్రును ప్రియులనగచాట్లబెట్టెడి దుర్మార్గురాండ్రును-
నీకు నమ్మిన చెలికత్తెలైయుందురు. హరివాసరత్రియంబు లాచ
రింపనియిండ్లను- కలహంబులే యెల్లప్పుడును గలుగు నిండ్లను
కలిమెంతలెక్కనపిమ్మట కనప్రలూడ్చెడి యిండ్లను దేవపూజ
లులేని యిండ్లును- యజ్ఞయాగ- అధ్యయనములులేని నిండ్లును
నీకు నందనోద్యానతుల్యములు- వత్సా! కలిపూరుషా నీవీ
మెను సహధర్మచారిణిగాగొని సుఖంబుండుము.

కలి—మహాప్రసాదము. (కలి జెష్టాదేవి నిష్క్రమింతురు.)

(సముద్రమును మధించుచుండగా నుచ్చైశ్రవము- ఐరావతము-
పాంచజన్యము- కల్పవృక్షము- అప్సరసలు- లక్ష్మిసుధాకరుఁడు- క్ర
మక్రమనుగా నుద్భవింతురు.)

బలి—ఈ వస్తుచయ మేమిసేయుదము. ఈ లక్ష్మిసుధాకరుల నేమి
చేయుదము.

బ్రహ్మ—బలీంద్రా! ఇందొక్కరహస్యమున్న దాలింపుము. మన
కొఱకై కూర్మావతార మెత్తిన యా శ్రీహరి కీలక్ష్మిదేవిని
యొసంగవలయునుగదా! హాలాహలపాన మొనరించిన యా
మహేశ్వరున కీసుధాకరు నొసంగుదము. ఈ సుధాకరుం డాత
ని జటాజూటమున నిలచి తన శీతకిరణంబులచే హాలాహలము
వల్ల హానిరాకుండ గాపాడుచుండును. ఇంతియెగాక మన కీ
మార్గ ముపదేశించినందుల కాహరి కీపాంచజన్య మొసంగిన

చో యుక్తముగానుండును. మిగిలిన వస్తువుల స్వర్గమందుం చుదము.

బలి—స్వర్గమందేల మా భూలోకమునకు గొంపోయెదము.

ఇంద్రు—సోదరా! మరల మా నీ యని యారంభించితివా! మన మందఱ మొక్కటిగాఁ గోరికదా యీ యత్నము.

బలి— పురందరా! మఱచితిని. అట్లనే యొనరింపవచ్చును.

[మథించుచుండగా అమృతముతో ధన్వంతరి ప్రవేశించును.]

బ్రహ్మ – ఇంద్రా! ఆ యమృతమును గొనుము.

బలి—నేనుగూడ గైకొనుట కర్హుండనే.

బ్రహ్మ—నీ యనుజుండుండ నీ కేటికీ శ్రమ.

ఇంద్రుడు—(అమృతమును గొనును).

బలి—(అమృతకలశమును రెండవవైపునుండి పట్టుకొని) నీ వొక్కడ వే పట్టుకొన్న యెడల జారి ప్రమాదవశత క్రిందబడునేమో!

బ్రహ్మ – ఆ సముప్రదేశమున మన మీయమృతమును భాగించుకొని యనుభవింతము రండు. (తనలో) నా ప్రయత్నము కొనసాగు నట్లు లేదు. అయినను ప్రయత్నించెదను. (నిష్క్రమింతురు.)

## తృతీయరంగము.

[ఇంద్రాద్యు లొకవంకను దానవు లొకవంకను ప్రవేశింతురు]

ఇంద్రు—బలిసార్వభౌమా! ఆ యమృతకలశ మిటు దెమ్ము. సమము గా భాగించెదను.

బలి— ఆమాత్రము కార్యము నే నొనర్పగలను. ఇంతియెగాక నీనుడివి నట్లు నేను నీ కగ్రసోదరుఁడ నగుటచే భాగముల నేన చేయ వలయును.

వరు—సోదరా ! దానవసార్వభౌమా ! యిప్పట్టున

శంబ—వరుణా ! యూరకొనుము.

గీ. యజ్ఞముల హావిర్భాగము । లందునపుడు
సోమరసపాన మొనరించి । సోలునపుడు
అనుజులముగాక నేడు కా।ర్యాంతరమున
సోదరులమటంచు బల్కగా । జోద్యమయ్యె.

ఇంద్ర—అక్కటా ! (తనలో) విధినతిక్రమింప విధికైనను దరమగు నా ! పడరాని యిడుమలబడి- బహుప్రయాసతో సంపాదించిన యీ యమృతమును- యీనగాచి నక్కలపాలు జేసినట్లు- యీ రక్కసిముండకొడుకుల పాలొనర్చితిని దేవాదిదేవా !

గీ. ఎన్నగారాని కష్టంబు । లెన్నియేని
పొంది సాధించి యమృతము । పాలసుదిండ్ల
పాలొనర్చితి నిప్పుడో । పరమపురుష
నీవె కాపాడవలె మమ్ము । నీరజాక్ష.

నారాయణా ! ఆర్తత్రాణపరాయణా! నీవే మా కిప్పట్టున శరణ్యము.

(ధ్యానించుచుండును.) (అనుబంధము 4)

[ప్రవేశము:—జగన్మోహిని.]

(నృత్యము జేయుచు జగన్మోహిని రాక్షసులపై నభినయముపట్టు చునొకనికి దెలియకుండ నొకనికిసైగచేయుచుండును.)

బలి—(తనలో) యెవ్వ రీసుకుమారగాత్రి! హాయ్-హాయ్-ఏమి-యీ లతాంగిసోయగము. నాహృదయమును యొక్క యటనిము షంబులో దొంగిలించినది. బాపురే- ఏమీ యభినయచాతు ర్యము- ధన్యోస్మి! ధన్యోస్మి!! యీసుగుణమంజరి తన కెంజిగు రాకుచేతులతో నన్నాలింగనపుజమునకు గబోలు రమ్మను

చున్నది. నాజన్మమింక సార్థకమైనది- యీయమృతపానము నకు దో డీమెయధరసుధామృతపానము గూడ లభింపనున్నది. ఈలాతన్వి లభించినచో నాకింక నీయమృతముతో బని లేదు. (5)

శంబ —(తనలో) వహ్వారే! ఎంతలో నాహృదయము దొంగిలించిన ది. నాహృదయమునందలి ప్రేమ ధనమంతయు గొల్లలాడి న న్నపరిమితానందము నఁదజేయుచున్నది. ఇప్పు డేమిసేయవ లయునో గోచరింపకున్నది.

ఉ. ఉల్లము తల్లడిల్లగ సముజ్జ్వలకాంతి సమూహవాహినుల్
వెల్లువకట్టి పార నతి వేడ్కనటింపుచు మోహినున్న యీ
పల్లవపాణి నాహృదయపద్మములోని యమూల్యమైన సొ
మ్మెల్ల హరించినిల్చి విధి యెట్లులిఖించెనో నోపకుండ్రహో.

రాకుసుడు—(తనలో) నించి తీరింది నాజన్మ. నన్నే రమ్మనుచున్నది. లేదు- లేదు- స్త్రీలనమ్మరాదు- ఈమెకు నిజముగా నాపై ప్రేమగలదా! ఏమో ఎవ్వరుచెప్పగలరు. (మోహిని మరల సైగచేయుచున్నది) ఆ- ఆ- నన్నే- అమ్మతోడు- నన్నే రమ్మ నుచున్నది. నా యంద మీమె డెందంబునకు నచ్చినదిగాబో లును. నన్ను మోహించింది గాబోలును.

గీ. ఇచటి పూరుషులందున నెన్నదగిన
యందగాడని తనమది యందు దలచి
యీ లతాతన్వి తనకృపాదృష్టి బరపి
నన్నె జేపట్టుమని కనుసన్న సేసె.

ఈమె లభించిన నా కీయమృత మక్కర లేదు.

ఇంద్రు—(కండ్లు తెరచి తనలో) పరమేశ్వరమాయ. ఈకాంత యెవ్వ రు- (పరికించి) ఈమెయందు హరిపోలికలు గొన్ని దోచుచు న్నవి- (మరల పరికించి) సందియము లేదు- ఆదినారాయణుఁ

డే- యీరూపంబు నవతరించి రాక్షసుల వంచింపదలచినట్లు
న్నది. కానిమ్ము- ఇప్పటి కిసుమంత ధైర్యము చిక్కినదిగదా!
ముం దేమిజరుగనున్నదో-

బలి—సుందరీ! నీ వెవ్వతెవు- నీవృత్తాంత మేమి- యెవ్వరియాన నీ
విచ్చటి కరుదెంచితివి- నీ తల్లిదండ్రు లెవ్వరు?

మోహిని—(నవ్వుచు)

గీ. ఒకరియానకు లోఁబడి । యుండగాని
యొరులె నాయానకై వేచి। యుందు రెపుడు
తల్లిదండ్రులు లేరు యీ । ధాత్రిమీద
నిటుల వర్తించుచుందు నే । నెల్లయపుడు.

న న్నెల్లరు జగన్మోహినియందురు. తనుబోఁటి సుందరాకారులజూచి
నంతటినుండి మన్మథుఁడు- నా డెందమును సందడింప- నే-
నిం- ద- రు- దెంచి- తి-

ఇంద్రు—దానవోత్తమా! ఆయమృతమును భాగించుకొందమురమ్ము.

బలి—దూరముగానుండుము- అమృతకలశమును ముట్టితివా! దౌడ
పండ్లూడగొట్టెదను.

జగ—దానవసార్వభౌమా! ఈతనితో కలహ మేల కలహకారణమేమి.

బలి—ఈ యమృతము ను మే మందఱమును గలసి సంపాదించితిమి.

జగ—అయిన సమముగా భాగించుకొనుడు.

బలి—తానే మాకును- వారికిని పంచియిచ్చునట.

జగ—అంగీకరించిన- నేను- అయిననాకేల? మీరే భాగించుకొనుడు.

బలి—కల్యాణీ! సంశయింతు వేల? మాధ్యస్థమువహించి యీయమృ
తమును పంచిపెట్టుము. (శంబరునితో రహస్యముగ) వారలకు
తక్కువ మనకు నెక్కువ యిమ్మని సైగజేసిన యట్లయని

మరల సన్న జేసినదిలెమ్ము. (ప్రకాశముగా) ఇంద్రా! యీ లతాతన్వభాగించుటను సమ్మతించెదవా?

ఇంద్రు—సమ్మతమే.

జగ—(కనుసన్నతో బలినిజేరి యమృతకలశమును గ్రహించి రహస్యముగా) ఈ దేవతలకు ముందుగా కొంచెముగాబోసి మిగిలిన దంతయును మనమే యనుభవింతము.

బలి—(అపవారించి) అట్లేచేయుము. ఈ యమృతమునకుఁ దోడుగ నీ యధరామృతమునుగూడ యొసంగి న న్నాదరింపవలెను.

జగ—(అపవారించి) అందులకేగదా! యీయత్నము. (ప్రకాశముగ) దేవదానవులారా! పంక్తులుదీర్చి కూర్చుండుఁడు.

(దేవత లొకవంకను రాక్షసు లొకవంకను గూర్చుందురు).

జగ—ఇంద్రాదిదేవతలారా! ఈ యమృతమును గ్రోలుడు.

(అని వారలకుఁ బోయుచున్నది).

రాహువు—(తనలో) ఈ జగన్మోహిని దేవతలకే పోయుచున్నది. అమృతమంతయు చెల్లినట్లున్నది. జాలముచేసిన కార్యములేదు. నేనుఁగూడ దేవతలప్రక్క జేరుదును. (అని దేవతలలో జేరి కూర్చుండును).

జగ—(వానికిని సుధబోయును).

సూర్యచంద్రులు—(రాక్షసుఁడని సైగసేతురు).

జగ—(పరికించి చక్రమున తలనరికి రిత్తకలశమును పారవైచి యంతర్ధానమగును).

బలి—ఏదీ! జగన్మోహిని అరే యొంతపనిజేసినది.

శంబ—అంతర్ధానమైనది నేను సందేహించినట్లే యైనది.

3 రాక్ష—ఇట్లు జరుగగలదనియే నేను దలంచితిని.

బలి—అయిననేమిలెండు. ఓదానవులారా! లెండు. లెండు. యుద్ధమునకు సిద్ధపడుడు. దేవతల జక్కాడుడు. (6)





శ్రీ

# సంగీత విష్ణులీలలు.



## వరాహావతారము.



[ప్రవేశము — హిరణ్యాక్షుఁడు]

హిర — మర్త్యలోకంబున నాతోఁ బోరాడఁగల శూరుఁడు గన్పడఁడే? కమలాసన వరప్రభావము సరిజూచుట కొక్క ప్రత్యర్థియైన భూలోకంబుననేడీ ఛీ! ఛీ! అంతలోకమును నిర్మించి యా బ్రహ్మ నాతోఁ బోరాడగలమానవు నేల సృజింపకఁ బోయె నోగదా! ఈ స్వర్గమునందు నెవ్వఁడైన యుండునేమో యను గంపె డాసతో నరుదెంచితినిగాని ఛీ! ఛీ! యిం దైనను దగినవాఁడు లభింపడయ్యెను. ఈ స్వర్గాధినాథుఁడును పర్వతగర్వభంజనుఁడును అగునావజ్రపాణియైన నింత రణభిక్షయొసంగునని దలంచివచ్చితినిగాని యాతఁడును గాన్పింపఁడు. కారణమేమైయుండును.

ముల్లోకంబులకు ప్రభుఁడైన యా శచీంద్రుఁడు నాధాకకుజడిసి పారిపోయి యెందైనడాగియుండునా? అట్లైన్నటికిని జరిగియుండదు.

సీ. అమృతంబనియెడి దివ్యామధముంగ్రోలి

బలుఁడనేనని గర్వపడెడివాఁడు

భువనత్రయంబును । బాలొప్పందగానేలి

బలుఁడ నేనని గర్వపడెడివాఁడు

అలనగంబులతెక్క । లవలీల దునుమాడి
బలుఁడ నే నని గర్వ।పడెడువాఁడు
హరిపాప్రిపుగలదంచు । ననయంబు దలపోసి
బలుఁడ నే నని గర్వ।పడెడువాఁడు
గీ. తగినవీరుండు లభియింప । దనదునేర్పు
జూప రణరంగమున నిల్వ।జూచుగాని
పిగ్గుబిడియముల్ లేనట్టి । చెనటిపోల్కి
వెరచి దాఁగొన నెటకేని । పరుగులిడునె

ఏదో కార్యాంతరమున నా వెన్నునితో మాట్లాడనరిగియుండును గాని నే వచ్చుచుండు టెఱిఁగి భీతిమై దాఁగొనియుండడు.

[ప్రవేశము—నారదుఁడు (7) పాడుచు]

హిర—(నారదుని సమీపించి) సురమునీంద్రా! నాకృతనమస్కారములఁ గొనుము.

నార—హిరణ్యాక్షా! యింకుంటివేమి? (తనలో) భూలోకమును భస్మీపటల మొనరించి యిచ్చోటి కరుదెంచితివా?

హిర—భూలోకంబున నాతోఁ బోరాడఁదగిన వీరుఁడు లభింపమి యీస్వర్గాధినాథుఁడైన శచీంద్రుడేని యించుక రణభిక్ష యొసంగగలఁడని వచ్చితిని. కాని యాతఁ డేదో కార్యార్థమై వైకుంఠమున కరిగియుండెనట. ఇచ్చట నాతని రాకకై వేచియుంటిని.

నార—(నవ్వును)

హిర—నవ్వెదరేమి?

నార—ఇచ్చట వేచియున్న లాభ మగపడదు. నీవచ్చు టెఱిఁగియే యాతఁడు వైకుంఠమున కేగియుండెను. ఆతఁ డింతలో వచ్చునట్లు లేదు.

హిర—నిజమేనా! ముల్లోకాధినాథుడే నాకు వెరచిపరుగిడెనా! యీలోకమును గొడ్డునారినదా?

నార—ఓయీ నీతో బోరాడదగినవాఁడు వరుణదేవుఁడు. అతని యొద్దకేగుము.

హిర—చిత్తము రణమొనరింప నామానంబు తత్తరిల్లుచున్నది.

(నిష్క్రమించును.)

నార—ఈతని యాయుఃకాలము పూర్తియైనట్లు దోచుచున్నది. వినాశ కాలే విపరీతబుద్ధిః యనునట్లీతనికి విపరీతబుద్ధులు పుట్టుచున్నవి. ఏమిజరుగునో చూచెదగాక. (17 పాడుచు నిష్క్రమించును.)

## ద్వితీయరంగము.

[ప్రవేశము: హిరణ్యాక్షుఁడు- వరుణుఁడు.]

వరు—దానవేంద్రా! కడుంగడు వ్యయప్రయాసల కోర్చి నీవిప్పట్టున నిచ్చటికిరాగతమేమియో ఎఱిఁగింపవీలగునేని యెఱిఁగింపుము.

హిర—గదాయుద్ధమున నిన్నుమించినవారు లేరని నారదుఁడు వినిపింప నధికతరామోదంబునంది నేటికిగదా తగినప్రత్యర్థి దొరికె నని సంతోషించి యిచ్చటి కరుదెంచితిని.

వరు—(తనలో) నీతోడనా పోరొనరించుట. నారదుఁడు నాకొంప దీయనెంచినాఁడు.

హిర—ఆలోచించుచుంటివేమి?

వరు—ఓయీ!

చ. మనముశాంతిబూని నియమంబున సంగరముజ్జగించియే
నన యమునున్నవాఁడ నిపుడాహవకేళి చరింపరాదు నీ

ఘనభుజవిక్రమస్ఫురిత । గాఢవిజృంభణముల్ జయింపజా
లిన ప్రతివీరులెవ్వరును । లేరు ముకుందుఁడు దక్క నెక్కడన్.

హిర — (తనలో) తప్పించుకొనఁ యత్నించుచున్నాడు. అయిన మరొ క్కపరి మాట్లాడిచూచెదగాక! (ప్రకాశముగ) ఓయీ! సమ ర్థుఁడగు వీరుడు లభించినచో యుద్ధముసేయక నాదుదానివలె నియమము- శాంతి- యని మాటలాడెద వేటికి? లెమ్ముకొంత కాలము వినోదముగా మల్లయుద్ధ మొనరింతము రమ్ము.

వరు — ఓయీ! పలుమాటలేల వినుము. నీవంటివీరుఁడు లభించుట యేతడవుగా యుద్ధమొనరించువాడను. కాని యీనియమమూ నుటచే యుద్ధమొనర్చుట లేదు. అయినను కమలాసనవరప్ర భావమున నమితపరాక్రమంబుగల నీతో నావంటి సామా న్యుఁడు పోరజాలు నే ముకుందునియొద్ద కేగుము.

హిర — ఆత డెచ్చోటనున్నాడను.

వరుణు — దానవకులావతంసమా!

చ. గొనకొని యమ్మహాత్ముఁడు వికుంఠపురంబున నున్నవాఁడుదా
నని మొనబెక్కు మాఱుఁ ఖి । యాతుల నోరిజయించి శక్తిపెం
పున నడిసన్న వీరుఁడని । భూజనకోటి నుతించునందువే
చను మతఁడిచ్చునీకునని । సర్వముదీఱెడు నంత మీాదటన్.

హిర — సరే గానిమ్ము అచ్చటికే పోయెదను. (తనలో) ఛీఛీ! యిట్టిపిరికిపందవని యెఱింగినచో రాకనేయుందును. (ముందు నకు నడచును.) తెరవాలును.

హిర — ఇక్కడ నింతయైనదింక యక్కడనెంతయగునో చూడవలయు ను. నాపేరు విన్నమాత్రముననే యింద్రుడు పాఱిపోయెను. యీవరుణుడు యుక్తియుక్తముగా మాటలాడి తప్పించకొని

నాఁడు. ఇంక నాముకుందుఁడుమాత్రము నాతోఁ బోరుటకు సమ్మతించునా ?

(తెరలోఁ వీణానాదము.)

అదుగో! నారదుని వీణాస్వనంబు వినవచ్చుచున్నది.

[ప్రవేశము నారదుఁడు 9 పాడుచు.]

నార — ఇచ్చటనే యుంటివేమి ? వరుణునియొద్ద కేగ లేదా !

హిర — ఏగితిని. లాభ మేమి ?

నార — వరుణుఁడు యుద్ధమొనరింప లేదా?

హిర — ఆవరుణుఁడుమాత్రము మాహిరణ్యాక్షునితోఁ బోరసాహసించునా ? అతఁడు దుర మొనరింపలేక మొుగిచేయిజూపుచు ముకుందునియొద్దకుఁ బొమ్మనెను. అందులకై వైకుంఠమున కేగుచుంటిని.

నార — వలదు. వలదు.

చ. గురుభుజుఁడమ్మహాత్ముఁడు వైకుంఠపురంబున నేఁడు లేఁడు భూ
భరమువహింపనాదికిటి । భావముదాల్చి రసాతలంబునం
దిరువుగనున్నవాఁడచటి । కేగఁగనోపుదువేని నేగుమం
దరయఁగగల్గు నీకునసురాంతకుతోడి రణంబవశ్యమున్.

హిర — ఏమీ ! వైకుంఠమున లేఁడా ! అట్లయిన రసాతలంబునకే బోయి యాతని నరసెదగాక. (నిష్క్రమించును.)

నార — వీఁడు నేఁడే హరిచేఁగూలఁగలవాఁడు. యీచిత్రమును సాంగముగాఁ జూచియే పోయెదఁగాక. (నిష్క్రమించును.)

(తెర యెత్తబడును. రసాతలము.)

[ప్రవేశము:—నారదుఁడు.]

నార — (తనలో) ఆ నారాయణదేవుని యవతారలీలల వర్ణింప నెవ్వని తరంబు. ముున్ను మత్స్యమై సోమకాసురాధముని జంపి బ్రా

జదువుల బ్రహ్మకిచ్చె. సురాసురులు సముద్రమథన మొనరిం పుచుండగా గ్రుంగిన గిరిక్రింద నిలచి యాకుధరభారమున వహించి దేవతల కమృత మొసంగెను. నేఁడీరక్షసాధముని జంపనాదికిటిరూపంబుదాల్చియున్నాఁడు... (ఎదుటజూచి) అల్లదే అమ్మహానుభావుఁ డెదురులేని శౌర్యమున విహార మొనరించు చున్నాఁడు.

సీ. తుద మొదళ్ళరుఁ జిక్కు । దునిసిపాఱఁగ మోర
 గులశైలములజిమ్ము । గొంతతడవు
బ్రహ్మండభాండంబు । పగిలిచిల్లులుఁబోవఁ
 గొమ్ములదాటించు । గొంతదడవు
జలధులేచును బంక । సంకులంబైయుంక
 ఖురములమట్టాడు । గొంతదడవు
ఉడురాజు సూర్యుండు । నొక్కమూలకుఁబోవ
 గఱుచవాలము ద్రిప్పుఁ । గొంతదడవు

గీ. గినియుఁ గుప్పించు లంఘించు । గొప్పరించు
 నెగయు ధరద్రిప్ప బాఱియుఁగా । నేపురేగి
 దానవేంద్రుని గుండెలు । తల్లడిల్ల
 బందిమెల్లన రణపరి । పంథియగుచు.

అల్లదే హిరణ్యాక్షు డీవంకకే వచ్చుచున్నాఁడు. నే నామాటుననుండి వీరియుద్ధనైపుణ్యమును దిలకించెదగాక (నిష్క్రమించును.)

(ప్రవేశము:—హిరణ్యాక్షుఁడు.)

హిర—(తనలో) అల్లదేముకుందుఁడు నాదికిటిరూపంబున నన్నుభయపెట్టుటకుగాబోలు సముద్రమంతయు వ్యాకులపెట్టుచున్నాఁడు. ఆ- ఆ- అదే. నావశవర్తినియైనభూమిని దంష్ట్రాగ్రమున నిల్పి వినోదించుచున్నాఁడు గానిమ్ము వీనిపనిపట్టెదగాక. (ప్రకాశ

ముగ) ఓరీ! నారాయణా! వనీవరాహరూపా!

క. గానకానినీవీ ధరణిం
గానిపోకుము విడుముకాక । కానియేఁగదవే
గానియెద నీప్రాణముగై
కొనుమిదెనాదుమాట । కొననేమిటికిఁ. (నిష్క్ర-)

(తెరయెత్తబడును.) వ రా హా వ తా ర ము .

ఈహిరణ్యాక్షుఁడు విరించి దయదలంచి యొసంగినవరముల కుప్పొంగి భూవలయము నన్నుమించినవీరుఁడు లేడని గర్వించి యెల్లర బాధించుచు ప్రజాకంటకుఁడయ్యె వీనిని జక్కాడి లోకంబుల కుపకారమొనర్చెదగాక.

[ప్రవేశము:—హిరణ్యాక్షుఁడు.]

(కం. గానకాని...అనుపద్యమును జదువుచు)

వరా—(సహాసించుచు.)

మ. వినరా యోరి యమంగణాచరణయు । ద్వృత్తిన్ననుస్నీదు ధీ
ననయంబున్ వనగోచరంబగు మృగం।బంచుం దలంతౌర నే
నెనయన్ వన్యమృగంబయూదుబలిమై । యేతెంచు నీబోటి యీ
శునకశ్రేణివధింతునేడని యొనన్ । సాకోర్చివర్తించినన్.

చం. ననునెదురంగజాలినఘనంబగు శౌర్యము ధైర్యమున్ బలం
బునుగలవేని నిల్వరణ।భూమిని నీహితులైనవారికిం
గనుగవ బాష్పపూరములు । గ్రమ్మగ మాన్పగనోపుదేని జ
య్యనజనబొమ్మ దానవకులాధమ యూరక రజ్జులేటికిన్.

హిర—ముకుందా! నీబీరంబులఁ బోనడచి నాతో బోరగలవేని నిండుమగంటిమి గలదేని రణంబుననిల్వుము. లేకున్న యిందాక బలపగిది కాళ్ళకు బుద్ధిసెప్పి పరుగిడుము.

వరా—ఛీ భుజాబలగర్వదుర్విదగ్ధా- ఆరణోచితస్థలంబునకు రమ్ము-
(ఇరువురు నిష్క్రమింపగా నారదుడు- ప్రవేశము.)

నార—ఏమి వీరి సమరనైపుణ్యము- ఇరువురును వెనుకంజవేయక-
కాదు- కాదు- హిరణ్యాక్షుడించుక వెనుకకేగుచున్నాఁడు-
లేదు- వెనుకకేగి తగరుకొండదాకినభంగి మరల హరినిదాకు
చున్నాఁడు- ఆ- చచ్చెను హిరణ్యాక్షుడు- లేదు నారాయణు
నిచే వ్రేటువడి క్రిందబడెను. మరల లేచుచున్నాడు- క్రిందబ
డినను మాదే గెలుపనినట్లు బీరంబులు పల్కుచున్నాఁడు-ఏమి
గుసగుసలు. (పైకిజూచి) తెలిసినది జగద్వినుత పరాక్రమ శీలు
రగు నీవీరులు యుద్ధనైపుణ్యమును దిలకించుటకు దేవతలెల్ల
విమానరూఢులై గగనమార్గంబున నిలచియుండిరి- అదే
బ్రహ్మ ఏదో పల్కుచున్నాఁడు.

(తెరలో)

ఉ. అంచితదివ్యమూర్తి పర। మాత్మక యీకలుషాత్ముఁడైన న
క్తంచరుఁ డస్మదీయవర । గర్వమునన్ భువనంబులెల్లఁగా
రించు మదించి యిట్టివిప। రీతచరిత్రునిఁ ద్రుంపకిట్లుపే
క్షించుటగాదు వీనిబలి । సేయు వసుందరకుం శుభంబగున్.

నార - (తనలో) చతురాననుండు వీనినివధించి భువనంబులకుపకార
మొనరింపుమని ప్రబోధించుచున్నాఁడు గాని సంధ్యాకాలమే
తెంచుచున్నదని యెఱుంగక కాబోలును హరి వానితోక్రీడిం
చుచందంబున యుద్ధమొనరించుచున్నాఁడు.

(తెరలో)

మ. అనఘాయీయభిజ న్మహూర్తమునదే । హరాతి మర్దింపవే
నసయంబున్ మఱిదైత్యవేళలగు సం। ధ్యాకాలమే తెంచినన్

ఘనమాయాబలశాలియైన దనుజున్ । ఖండింపగారాదుగా
వునసీవేళన తుంపుసజ్జనహిత । పోద్యోగరక్తుండవై.

నార—కమలాసనుఁ డదే దనుజునివధింపుమని దేవాదిదేవుని త్వర పెట్టుచున్నాఁడు- అదే- అదే- దేవదేవుండు చక్రమందుకొని యారక్కసుపై విడచినాడు- దనుజుఁడు నేలగూలినాడు- ఆ దనుజాధముని దృక్కులింకను నాహరిపైననే యున్నవి.

మ. పరయోగీంద్రులు యోగమార్గముల నెవ్వానిన్ మనోవీధి సు
స్థిరతన్ లింగశరీరభంగమునకై । చింతింతు రాపంకజో
దరు పాణ్యాహతిఁ దన్ముఖాంబురుహమున్ । దర్శించుచుంజచ్చెదు
ర్భరితోత్తంసుడు దైత్యవల్లభుని సౌభాగ్యంబు దానెట్టిదో.

(తెరలేవగా హిరణ్యాక్షునిపై హరియుండును.
బ్రహ్మేంద్రు లిరువంకలను జేరి స్తుతింతురు.)

బ్రహ్మ—

చం. తలపరసాతలాంతరగ । తక్షితిఁ గ్రమ్మరనిల్పినట్టి నీ
కలితనమెన్నవిస్మయము । గాదు సమస్తజగత్తులొ లిమై
గలుగకఁ జేయుటద్భుతము । గాక మహోన్నతి నీకొనర్చు పెం
పలరిన కార్యముల్ నడప । నన్యులకుందరమే రమేశ్వరా!

ఇంద్ర—

ఉ. విశ్వభవస్థితి ప్రళయ । వేళలయందు వికారసత్వమున్
విశ్వము నీవయై నిఖిల । విశ్వముఁ గోలి సృజింతువిందిరా
ధీశ్వర యీశ కేశవ త్రయీమయదివ్య శరీరదేవ నీ
శాశ్వతలీల లిట్టివని । సన్నుతి సేయగమాకు శక్యమే.

(తెరవ్రాలును.)





శ్రీ

# సంగీత విష్ణులీలలు.



## నరసింహావతారము.



ప్రథమరంగము.

[ప్రవేశము:—హిరణ్యకశిపుఁడు, లీలావతి విప్రజిత్తి మొదలగువారు.]

హిర—నిన్నటిదినంబునుండియు చిరంజీవియగు ప్రహ్లాదునిఁ జూడవలయునని యుండుటచే కుర్రని దోడ్కొనిరమ్మని చండామార్కులకు వార్తబంపినను రాకుండిరేలకో గదా!

లీలా—అదే! కుమారుని వెంటబెట్టుకొని గురుపుత్రులు వచ్చుచున్నారు.

[ప్రవేశము:—ప్రహ్లాదుఁడు చండామార్కులు.]

ప్రహ్లా—(తండ్రికడకేగి) జనకా! నాకృతవందనముగొనుఁడు.

హిర-లీలా—దీర్ఘాయుష్యమస్తు, గురుపుత్రా! ఆయాసన మలంకరింపుఁడు.

హిర—(ప్రహ్లాదుని దగ్గరగాదీసుకొని) కుమారా! నీవు గురువులకడ శ్రద్ధగా విద్యనభ్యసించుచుంటివా! గురువులకడ నీవిదివరకెట్టి శాస్త్రముల నభ్యసించితివి.

ప్రహ్లా—తండ్రీ పెక్కుశాస్త్రముల జదివితిని గురువులెన్నింటినో జదివించిరి. ఈ చదువులు నిస్సారములు.

ఉ. ఎల్లశరీరధారులకు । నిల్లను చీకటినూతిలోపలన్
ద్రెళ్ళకయుండ నేనును మ । తిభ్రమమొంది భిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వమున్ నతని । దివ్యకళామయమంచు విష్ణునం
దుల్లముఁ జేర్చి తారడవి । నుండుటమేలు నిశాచరాగ్రణీ.

హిర—ఏమిది నావైరియగు నావిష్ణుని గొప్పజేసి వర్ణించుచుంటివి. ఇయ్యది నీకెవ్వరుపదేశించిరి. లేక నీకేదోచెనా?

శా. నాకుంజూడగ చోద్యమయ్యెడి గదా । నాతండ్రి యీబుద్ధి దా
నీకున్ లోపలదోచెనో పరులు దు । ర్నీతుల్ పఠింపించిరో
యేకాంతంబున భార్గవుల్ పలికిరో । యీదానవశ్రేణికిన్
వైకుంఠుండు కృతాపరాధుడతనిన్ । వర్ణింపనీ కేటికిన్.

కుమారా! మనకులాచారముల పోద్రోచివైరిజనుల నేల కీర్తించెదవు?

మ. సురలందోలుటయో సురాధిపతులన్ । ద్రుక్కించుటో సిద్ధులం
బరి వేధించుటయో మునిప్రవరులన్ । బాధించుటో యక్ష కి
న్నర గంధర్వవిహంగ నాగపతులన్ । నాశంబునొందించుటో
హరియుంచున్ గిరియంచు నేలచెడమో । హంధుండవై పుత్రకా!

ప్రహ్లాదుఁడు—(గురునివైపునకు దిరిగి)

శా. అజ్ఞుల్ గొందఱు నేముదామనుచు మా । యం జెంది సర్వాత్మకుం
బ్రజ్ఞాలభ్యుదరన్వయక్రమములన్ । భాషింపగా నేరరా
జిజ్ఞాసాపథమందుమూఢులుగదా । చింతింపబ్రహ్మాది వే
దజ్ఞుల్ తత్పరమాత్మువిష్ణు నితరుల్ । దర్శింపగా నేర్తురే.

చండా—నాయనా ప్రహ్లాదా! హరిభక్తిమానుము.

ప్రహ్లా—గీ. ఇనుమయస్కాంతసన్నిధి । నెట్లుభ్రాంత
మగు హృషీకేశుసన్నిధి । నావిధమున
గరగుచున్నది దైవయో । గమున జేసి
బ్రాహ్మణోత్తమచిత్తంబు । భ్రాంతమగుచు.

హరియొక్క విశేషమాలో చుంపుడు-

సీ. మందారమకరంద । మాధుర్యమునఁదేలు
మధుపంబుబోవునే । మదనములకు
నిర్మలమందాకి । నీవీచికలఁదూగు
రాయంచజనునె త । రంగిణులకు
లలితరసాల ప । ల్లవఖాదియై చొక్కు
కోయిలసేరునే । కుటజములకు
పూర్ణేందుచంద్రికా । స్ఫురితచకోరక
మరుగునే సాంద్ర నీ । హారములకు
నంబుజోదరుదివ్య పా । దారవింద
చింతనామృతపాన వి । శేషమత్త
చిత్తమేరీతి నితరులఁ । జేరనేర్చు
వినుతగుణశీల! మాటలు । వేయునేల?

చండ— ప్రహ్లాదా! మాచెప్పిన శాస్త్రములనెల్ల మంటగల్పితివా!

ఉ. పంచశరద్వయస్కుఁడవు । బాలుఁడవించుకగాని లేవు భా
షించెదు తర్కవాక్యములు । జెప్పిన శాస్త్రములోని యర్థమొ
క్కించుకయైనఁజెప్ప వసు । రేంద్రుని ముందట మాకు నాదలన్
వంచుకొనంగజేసితివి । వైరివిభూషణ వంశదూషణా.

హిర— కుమారా! మనకులద్వేషియగు నాహరిని కీర్తించెదవేల నా
మాటలు వినుము హరిభక్తి మానుము మేలగును.

ప్రహ్లా— జనకా! ఆదిమధ్యాంత శూన్యుండును. రాజసాది గుణత్రయ
విరాజితుండును- చిరశుభాకారుండును- మోక్షసందాయకుం
డును. అగు నాదేవదేవునకు- వీరు- వైరులనియు వారు హితు
లనియు బేధమున్నదా! బుద్ధిహీనులమై మనమట్లు దలంచుచుం
దుముగాని యాపరమాత్మున కట్టిదెన్నటికిని లేదు. పిపీలికాది

బ్రహ్మపర్యంతమాతఁడు సమంబుగ నెల్లర సమదృష్టినారయు చుండును.

హిర—ఛీ! దురాత్మా! నాకే బుద్ధులుగరపుచుంటివా!

చ. తనయుఁడుగాడు శాత్రవుఁడు। దానవభర్తకువీఁడు దైత్యచం
దనవనమందుఁ గంటకయ। తక్షితిజాతముభంగి బుట్టె నా
డనవరతంబు రాక్షస కు। లాంతకు బ్రస్తుతిసేయుచుండు దం
డనమునఁ గాని శిక్షలకు। డాయఁడు పట్టుఁడు కొట్టుఁడుద్ధతిన్.

చండా—దనుజేంద్రా! మాపల్కులాలించుము-ఈతఁడింకను పశివాఁడు దండనమున కాగఁలేఁడు గాన వారల దోడ్కొనిపోయి మా నిపుణత్వమంతయు జూపి గోపించియో దండించియో జదివించి యీపాడు హరిభక్తి మానునట్లొనరింతుము.

లీలా—నాథా! చండామార్కులు జెప్పినవిధంబున వర్తించుటయె కర్తవ్యము-యింకను ముక్కుపచ్చలారని యీచిన్నిపాపనిదండించినచో లాభముండునా! కొంచెము ప్రాజ్ఞుఁడైనచో నేమేని బుద్ధిదెచ్చుకొనునేమోగదా!

హిర—మంచిదట్లనేగానిండు-గురుపుత్రా! మీరాయిచ్చవచ్చిన తెఱంగున వీనికి బోధించి హరిభక్తిమానునట్లొనరింపుఁడు-

(చండామార్కులు ప్రహ్లాదులు నిష్క్రమింతురు)

హిర—ప్రాణేశ్వరీ! రమ్ము లోనికేగుదము-నేఁడు నామనం బన్యాక్రాంతమై యొకవిధమగు విచారముచే నావరింపబడినట్లున్నది-

(నిష్క్రమింతురు-తెరవాలును)



## ద్వితీయ రంగము.

(హిరణ్యకశ్యపుఁడు-చండామార్కులు ప్రహ్లాదుఁడు దూరమున నుండగా
(తెర లేచును)

చండా — నాయనా ప్రహ్లాదా! నామాటవినుము-నీతండ్రియెదుట విష్ణునివర్ణింపకుము- నామాటవినుము- మాకు దలవంపులు దేకుము కనుసన్నల మెలగి నీతండ్రియిష్టానుసారమువర్తించుము- ఈ పాడుహరిభక్తికీర్తనలపద్యములు నీతండ్రిచెంతఁ బాడకుము.

ఉ. త్రిప్పకుమన్న మామతము । దీర్ఘములైన త్రివర్గపాఠముల్
దప్పకుమన్న నేఁడుసున । దైత్యవరేణ్యుని మ్రోల నేము మున్
జెప్పిన నీతిగానిమఱి । సెప్పకుమన్న విరోధినీతులన్
విప్పకుమన్న దుష్టుఁగు । విష్ణుచరిత్రకథార్థజాలముల్.

అదే నీతండ్రి నమస్కరింపుము- దానవసార్వభౌమా! నీకుమారుని సకలనీతిశాస్త్ర పారంగతునిఁ జేసి దోడ్కొనివచ్చితిని.

క. శిక్షించితిమన్యములగు
పక్షంబులుమాని నీతి । పారగుఁడయ్యెన్
రక్షోవంశాధీశ్వర
వీక్షింపుము నీకుమారు । విద్యాబలమున్.

ప్రహ్లా — జనకా! నమస్కరించుచున్నాఁడను.

హిర — కుమారా! దీర్ఘాయుష్మంతుఁడవై యుండుము- (అని దగ్గరకు దీసికొని ముద్దుగొని తొడపైగూర్చుండబెట్టుకొని-) ఇంతకాలము దనుక నీవేమిజదివితివి- గురువులేమిబోధించిరి-

శా. చోద్యంబయ్యెడి నింతకాలమరిగెన్ । శోధించి యేమేమి సం
వేద్యాంశంబులు సెప్పిరో గురువులే । వెంటంబఠింపించిరో

విద్యాసారమెఱుంగఁ గోరెదభవ । ద్విజ్ఞాతశాస్త్రంబులోఁ
బద్యంబొక్కటి సెప్పి సార్థముగ తా । త్పర్యంబుభాషింపుమా.

ప్రహ్లా — జనకా! గురువులెన్నియో శాస్త్రంబులు సెప్పిరి నేను జదివితిని చదువులలోనిసారమును గూడగంటిని.

క. చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థముఖ్య । శాస్త్రంబులు నే
జదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మమెల్ల । జదివితి తండ్రీ.

హిర — నాయనా! మంచిది. ఆహాఁహరిభక్తి మాని శాస్త్రంబులనెల్లజదివి సారముగ్రహించితివా! మంచిది. యింకనెన్నడును నావిష్ణునిగీర్తింపకుము. నీవు నేర్చినసారమెద్దియో నాకుఁ గూడ విన్పింపుము.

ప్రహ్లా — జనకా! ఆలించుము.

సీ. కమలాక్షునర్చించు । కరములు కరములు
శ్రీనాథువర్ణించు । జిహ్వ జిహ్వ
సురరక్షకుని జూచు । చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు । శిరము శిరము
విష్ణు నాకర్ణించు । వీనులు వీనులు
మధువైరి దవిలిన । మనము మనము
భగవంతువలగొను । పదములు పదములు
పురుషోత్తముని మీఁది । బుద్ధిబుద్ధి
దేవదేవుని జింతించు । దినము దినము
చక్రహస్తుని ప్రకటించు । చదువు చదువు
కుంభినీధవుజెప్పెడి । గురుఁడు గురుఁడు
తండ్రిహరిఁజేరు మనియెడి । తండ్రి తండ్రి.

జనకా ఆలించుము విష్ణుభక్తిలేని మానవుఁడు మానవుడే.

సీ. కంజాక్షునకుగాని । కాయంబు కాయమే
పవనగుంభిత చర్మ । భస్త్రిగాక
వైకుంఠుఁబొగడని । వక్త్రంబు వక్త్రమే
ఢమఢమధ్వని తోడి । ఢక్కగాక
హరిపూజనములేని । హస్తంబు హస్తమే
తరుశాఖ నిర్మిత । దర్విగాని
కమలేశు జూడని । కన్నులు కన్నులే
తనుకుడ్యజాల రం । ధ్రములుగాక
చక్రిచింతలేని । జన్మంబు జన్మమే
సరళిసలిలబుద్బు । దంబుగాక
విష్ణుభక్తిలేని । విబుధుండు విబుధుఁడే
పాదయుగముతోడి । పశువుగాక.

జనకా! సంసారవారాసిలో జిక్కుకొనిన మానవులకు విష్ణుభక్తిలేకున్న మోక్షములభించునా !

సీ. సంసారజీమూత । సంఘంబు విచ్చునే
చక్రిదాస్యప్రభం । జనములేక
తాపత్రయాభీల । దావాగ్నులారునే
విష్ణుసేవామృత । వృష్టిలేక
సర్వంకషాఘౌఘ । జలరాసులింకునే
హరిమనీషా బడ । బాగ్నిలేక
ఘనవిపద్గాఢాంధ । కారంబులడగునే
పద్మాక్షునుతిరవి । ప్రభలులేక
నిరుపమానపునరావృత్తి । నిష్కళంక
ముక్తివిధిఁ గానవచ్చునే । ముఖ్యమైన

శార్ఙ్గకోదండ చింతనాం । జనము లేక
తామరసగర్భునకునైన । దానవేంద్ర.

హిర —(మండిపడుచు) ఓరీ! దుర్మతీ! (కుమారుని క్రిందికిదోసి) నా యెదుట యిట్లు నావైరినివర్ణింప సాహసించిన నిన్ను పుత్రవ్యామోహమునబడి మన్నించితిని గాని లేకున్నచో నీపాటికి నా ఖడ్గమున కెరయైయుందువు- ఎంతగా మీరిపోయితివి- ఇట్టికులద్రోహివగుదువని కలనైనం దలంపనైతిగదా! అయినను యింకు ని న్నవలసినది లేదు.

చ. పటుతరనీతిశాస్త్ర చయ । పారగు జేసెదనంచు బాలునీ
వటుగొంపోయి వానికి న । నర్హము లైన విరోధిశాస్త్రముల్
కుటిలత జెప్పినాడవు భృ । గుపుత్రవరుండ వటంచు నమ్మితిం
గటకట బ్రాహ్మణాకృతివి । గాక యథార్థపు బ్రాహ్మణుండవే.

చండా—దానవేశ్వరా నాపైన నలుగకుము.

ఉ. తప్పులు లేవు మావలన । దానవనాథ విరోధిశాస్త్రముల్
చెప్పము క్రూరులైపరులు । చెప్పరు మీచరణంబులానను
మ్మెప్పుడుమీకుమారునకు । నింతయు నైజమునీవ యెవ్వరుం
జెప్పెడి పాటిగాదు ప్రకృతి । చింతదలంపుము నేర్పుకైవడిన్.

హిర —ఓరిడింభకా! గురుపుత్రు లుపదేశింపని యీదుర్మతము నెవ్వరుపదేశించిరి. వారల బేర్కొనుము తత్క్షణము వారిని ద్రుంచెదను.

ప్రహ్లాదుండు— జనకా!

ఉ. అచ్చపుజీకటిం బడి గృ । హవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచు బుట్టుచుం మరల । చర్విత చర్వణులైనవారికిం
జెచ్చెరబుట్టునే పరులు । జెప్పిననైన నిజేచ్ఛనైననే
మిచ్చిననైన గానలకు । నేగిననైన హరిప్రబోధముల్.

ఒకరుపదేశించినంతమాత్రమున విష్ణుభక్తి యలవడునా! పూర్వకర్మ సంచితంబుగ దనంతనదియే యుద్భవింపగలదు.

హిర—ఏమీ! నీపొగరుబోతు సమాధానము- కానిమ్ము- యిట్టిప్రగల్భవాక్యము లాడువారలను మన్నింపరాదు.

శా. అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు దు। ష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి- రక్షసేయుక్రియనీ। యజ్ఞాన గులద్రోహి దు
స్సంగుం గేశవపక్షపాతి నధమున్। జంపించి వీరవ్రతో
త్తుంగఖ్యాతిఁ జయించెదం గులముని। ర్దోషంబు గావించెదన్.

దానవులారా! రండు-యీతుచ్ఛునిఁ గొనిపోయి మీయిచ్ఛవచ్చినట్లు బాధింపుడు. కట్టుఁడు కొట్టుఁడు హరిభక్తి మానివేయుదుననువఱకు-మీ యిచ్ఛవచ్చినట్లు శూలములచేఁ బొడువుడు గదలచే మొత్తుఁడు.

[ప్రవేశము: - యిరువురు రాక్షసులు.]

ప్రహ్లా—జనకా! శ్రీమన్నారాయణచరణారవిందమరందపాన పారవశ్యంబున దేలుచున్న నా కెట్టియాపదలును రానేరవు.

హిర—(దానవులతో) ఈకొత్రిగానిఁ గొంపొండు.

ప్రహ్లా—శ్రీహరీ! శ్రీహరీ! (దానవులు దోడ్కొనిపోవుదురు.)

హిర—(తనలో) ఎంతచెప్పినను వినడయ్యెను. కడకాదనుజులు యువరాజని సంశయింపక తమయిచ్ఛవచ్చినరీతిఁ బాధింపుచున్నను సహించుచు శ్రీహరీ! శ్రీహరీ! యని నుతించునుగాని యించుకంతయు దైన్యమొందడు.

ఉ. శూలములన్ నిశాచరులు। సుక్కఁగదేహము నిగ్రహింపగా
బాలుఁడు నేలపైబడడు। పాఱఁడు చావఁడు తండ్రినైన నా
పాలికివచ్చి చక్రధరు। పక్షముమానితినంచు పాదముల్
ఫాలమునోకఁ ద్రొక్కఁడఁన। పాయత నుండుట కేమి హేతువో,

చండా—(రాజు యభిమత మెఱింగి) రాజేంద్రా! నాపలుకు లాలకింపుము. శుక్రాచార్యుల వారు వచ్చునంతవఱకీతని నింక బాధింపకుము. వారు వచ్చి రేని తగుమార్గములబోధించి విష్ణుభక్తి విడచునట్లు జేసెదరు. అంతవఱకు మేముగూడ వేయి విధంబుల యత్నించుచునే యుందుము.

హిర — అట్లొనర్పుడు- రండాతని దోడ్కొని వెడలుదురుగాక.

(నిష్క్రమింతురు.)

(తెర పడును.)

## తృ తీ య రం గ ము.

—: పాఠశాల :—

(చండామార్కులు- ప్రహ్లాదుఁడు- యితరబాలురు.)

చండా—ప్రహ్లాదా! ఆహరిభక్తిమాని తిరంబుగ నా నేర్పుత్రివర్గ పాఠముల జదువుచుండుము. నీతోడి బాలురచేఁగూడ జదివించుచుండుము. జపతపంబుల నిర్వర్తించుకొని యొక్కఘడియలో వచ్చెదను. (నిష్క్రమించును.)

1 బాలుఁడు—పంతులువెళ్ళినాడు- పుస్తకముల మూలపారెయ్యండి ఆడుకుందాము రండి.

2 బాలుఁడు—నీకెప్పుడు ఆటలేకాని చదువక్కఱలేదు.

3 బాలుఁడు — నువ్వు మాచదివేసినావు లెద్దూ.

4 బాలుఁడు—ప్రహ్లాదా! ఆడుకొనుటకు వచ్చెదవా!

ప్రహ్లాదుఁడు—బాలకులారా! ఆలించుడు. ఆటపాటలో కాలమునువ్యర్థము సేయకుడు- సకలజన్మంబులో మనుష్యజన్మంబుత్తమము- అయ్యదియుశతవర్ష పరిమితంబైన జీవితకాలంబున నియమితం

బై యుండు. అందు సగమంధకార బంధురంబయి రాత్రిరూపంబున నిద్రాదివ్యవహారంబున నిరర్థకంబగు చిక్కిన యేబది వత్సరంబుల బాల్యకైశోరకౌమారాదివయోవిశేషంబుల యిరువదివత్సరంబులు గతించును, మిగిలిన ముప్పదివత్సరంబులందును నింద్రియంబులచేతఁ బట్టుబడి యరిషడ్వర్గాదులకుఁ జిక్కి దన్మధ్యంబునుండి వెలువడజాలక నాశాపిశాచంబుచే నావహింపబడి ధన కనకవస్తువాహనంబులను బాంధవులను ప్రేయసిని వర్జింప నేరక నిర్గమద్వారశూన్యంబగు మందిరంబున నుండి వెడలెడు మార్గంబుగానక చింతించు కీటకంబుచందంబున గృహస్థుండు స్వయంకృతకర్మపాశబద్ధుఁడై మోక్షసాధనంబులగు మార్గంబులగుర్తెఱుఁగక, రమానాథచరణారవిందగంధరసాస్వాదనంబెఱుఁగక మూఢుడై దండధరుమందిరద్వారగేహాళిజాజ్వల్యమానవైతరణీదహనదారుణజ్వాలాజాలదందహ్యమాన దేహులంగూడి శిఖిశిఖావగాహంబుల నొందుచుండును. ఏపురుషుండు యరిషడ్వర్గంబుల జయించి మనోనిగ్రహుండై తనహృదయపద్మంబున నారమాకాంతుని పాదపద్మంబుల నిడుకొని సేవించుచుండునో యాపురుషుండు మోక్షలక్ష్మినిగైకొని సర్వకాలసర్వావస్థల నా శ్రీమన్నారాయణుని చెంత నివసించియుండు. కాన మోక్షార్థియైనజీవి తన యిచ్ఛవచ్చినరీతిఁ గాలంబును వృథసేయక తుచ్ఛంబులగు నిహసౌఖ్యంబుల కాశజేయక దేహావసాన పర్యంతము నారాయణుని సేవించుటయె కర్తవ్యము.

1 బాలుఁడు—ప్రహ్లాదా! ఆతడెట్టివాఁడు-ఎచ్చోటనుండును.

2 బాలుఁడు—ఆతని మెప్పించు టెట్లు?

3 బాలుఁడు—మోక్షంబు సాధించు టెట్లు?

4 బాలుఁడు—ఈప్రశ్నల కుత్తరమిచ్చినచో మేముగూడ హరిభక్తు లమైయుందుము.

ప్రహ్లాదుఁడు — ఆనారాయణుండు కరుణాపరిపూరితుండై యెల్లర సమదృష్టి నీక్షించుచుండును. పృధివ్యాప్ తేజోవాయు రాకాశంబులందును భూతవికారంబులయిన ఘటపటాదులందును సకల చరాచరస్థూలసూక్ష్మజీవసంఘంబులందును రజస్తత్వతమోగుణంబులందును గుణరహితంబైన మహత్త్వాదియందును పెక్కురూపంబుల-రూపశూన్యుండై- యుండియు లేనట్టుల వెలుంగుచుండును. పెక్కుమాటలేల- అనారాయణదేవుండు లేనిస్థలంబుగాని వస్తువుగాని యేలోకంబునందునులేదు. అది కారణంబుగ మనము సర్వభూతములందును సుహృద్భావంబు గలిగి వర్తించిన నధోక్షజుండు పరమానందంబునొందును. న నంతుండును-నాద్యుండును నగునాహరి సంతసించి తనకృపాదృక్కిరణంబుల మనపైఁ బ్రసరించిన నింక మనకుఁ గావలసినదే మున్నది. జనార్దనచరణసరసిజయుగళసంస్మరణ సుధారసపానపరిపుత్తులమైనచో నకాంక్షితంబుగ మోక్షలక్ష్మి తనంతదానె మనల వరించితీరును.

1 బాలుఁడు—నీచెప్పినది సహజముగానున్నది.

2 బాలుఁడు—మేముగూడ హరిభక్తుల మయ్యెదము.

ప్రహ్లాదుఁడు —అయినచోరండు. హరినిభజింతము. (10)

[ప్రవేశము:—చండామార్కుఁడు]

చండా—పాఠశాలయంతయు నల్లకల్లోలముగానున్నదే- (పరికించి) ఆహా మించివచ్చినది. ఎల్లరును విష్ణుభక్తులైరి- ప్రహ్లాదుని మూలమున రాక్షసబాలు రెల్లరును పాడగుచుండిరి. భూకాంతున కియ్యది యెఱిగింపకున్న ముప్పువాటిల్లగలదు-(ప్రహ్లాదు

నిసమీపించి బలవంతముగానాపి) చాలుచాలు. మంచిపనిజేసి తివి యీరీతిగానేనా పాఠములు జదువుట రమ్ము. నీతండ్రితో నీవృత్తాంతమంతయుజెప్పి నిన్ను తగినట్లు శిక్షింపజేతును. రమ్ము. (ప్రహ్లాదుని దోడ్కొని నిష్క్రమించును.)

[ప్రవేశము:—హిరణ్యకశ్యపుఁడు.]

హిర—(తనలో) ప్రహ్లాదునకేమేని బుద్ధివచ్చియుండునా! అకటకటా! ఆపాడు హరిభక్తిగాక వీనియందొక దుర్గుణములేదే! యిట్టి సుగుణరాసిని నిష్కారణముగా బాధించితి- బాధించితి- కన్న కుమారుడని- మనమున నించుకేని కనికరింపక బాధించితి- అయినను- నాయెడలఁగలభక్తి వీడక విష్ణుభక్తి పరాయణుడై జరించుచుండెనే! ఇంక వీనిని నెట్లుస్వాధీనమొనర్చుకొందును. (ఆలోచించి) పసిబాలుఁడెక్కడ కూరబాధలకోర్చియుండు టెక్కడ- నాశాత్రవుండగు నాహరి- నాసోదరుని యమలోకంబున కంపిన వఁరి- వీనియం దావేశించియుండి యాబాధల సహించుచు బాలకునిగాపాడుచుండెను. ఓరీ! నామగుణ రూపహీనా! నీకండకావర మడగించెదలెమ్ము. నాధాటకు వెరచి డాగొనిన నిన్నేసంహరింపజాలనియెడ కమలాసనదత్త మహోత్కృష్టవరప్రభావమెందులకు- దుర్మతీ! తత్తరపడకుము యీహిరణ్యకశ్యపుడింతలో శాంతివహింపజాలఁడు.

[ప్రవేశము:—తొందరతో చండామార్కులు.]

హిర—ఏమిది గురుదేవా! యింతతత్తరబాటున నరుదెంచితిరేమి? చిరంజీవి విష్ణుభక్తిమానెనా! లేదా!

చండ—దానవసార్వభౌమా! కొంపమునుగునట్లున్నది- నీకుమారునిమూలముగా తక్కుంగల బాలకులుగూడ పాడగుచుండిరి.

శా. రక్షోబాలురనెల్ల నీకొడుకు చేరంజీరి లోలోననా
శిక్షామార్గము లెల్ల గుల్లలని యాక్షేపించి తానందఱన్
మోక్షాయత్తులజేసినాఁడు మనకుఁ మోసంబువాటిల్లె నీ
దక్షత్వంబున జక్కఁజేయవలయుఁ దైతేయవంశాగ్రణీ!

హిర—తానుచెడినదేగాక వారలగూడఁ జెరుపయత్నించెనా! మీ
రంతటశిక్షించి నీకిది తగదని బోధింపలేదా!

చండా—నేను జపంబు సర్వర్తించుకొని పాఠశాల కరుదెంచునప్పటి
కి బాలురెల్లరును తన్మయత్వముతో బాడుచు నాడుచుండిరి.
అతికష్టముపై నీతనయుని బట్టినిల్పి యిదేమని ప్రశ్నించగా
నాకుఁ గూడ విష్ణుభక్తి యుపదేశింపఁ బ్రారంభించెను. అంత
జేయునది లేక యీవృత్తాంతము తమకెఱుఁగఁజేయ వచ్చితిని
ప్రహ్లాదుని యల్లదే గుమ్మముకడ నిలిపితి.

హిర—(కోపమున) ఓరీ! డింభకా! పుత్రుడవని కనికరముజూపిన
కొలదియు నెత్తిపైకెక్కి తాండవించుచున్నాడవా! ఓరీ!
అలంబసా! ప్రహ్లాదు నిట్లీడ్చుకొనిరమ్ము.

[ప్రవేశము:— ప్రహ్లాదుఁడు, అలంబసుఁడు.]

హిర—ప్రహ్లాదా! కడసారిగా నడుగుచున్నాను. విష్ణుభక్తిమానెద
వా! నాఖడ్గమున కెరయయ్యెదవా! జెప్పుము. కులాచార
ధర్మంబులఁ బోవిడిచి నీపినతండ్రిని వరాహరూపంబునఁ జంపిన
యద్దురాత్ముని బట్టువలె నేలవర్ణించెదవు.

ప్రహ్లా—జనకా! ఆమహాత్ముని యూరకనిందించెదవేమి. యిటువిను
ము. నా పినతండ్రియొనర్చిన ఘోరపాపమే యాతనిని వరా
హరూపంబున జక్కడినది. నారాయణదేవునకు రాగద్వేష
ములు లేవు.

హిర—దురాత్మా! (అని తన్నుచున్నాఁడు.)

ప్రహ్లా—శ్రీహరీ !

హిర — ఛీ! నోరుమూయుము హరియనువాఁడెవ్వఁడును లేడు. ఉన్న చో తనపిత్రుఁడైన దిక్పాలురఁజంపి చెండాడునాఁడు నిందుము గఁటిమిఁగలవాఁడైనచో నాతోఁబ్రతిఘటించి నిలువకుండునా.

ప్రహ్లా—జనకా! కామక్రోధాదులజయించి యింద్రియంబులఁ జిక్కువడకఁ జతురులై వర్తించు పుణ్యచరిత్రులకుగాని నీవంటి వారలకు గోచరింపఁడు.

హిర—ఓరీ దుర్మతీ! నీమందమతి యింకను మేరమీరుచున్నదే (అని మరలదన్ని) ఓరీ! అలంబసా యొక్క పాములవానిని బిలిపించి క్రూరసర్పములచే వీనిని నాయెదుట గరపింపుము.

[ప్రవేశము: —లీలావతి. 11 పాట.]

లీలా—నాథా యించుక కరుణింపుఁడు. కుమారుని-నవమాసంబులు గర్భమందుదాల్చి గనిన నాకుమారుని- యీముక్కుపచ్చలారని ముద్దుకుఱ్ఱని- మనవంశలతాంకూరుని-చంపించుటయేనా! అందునను- అజ్ఞానముచే పసితనమున- విష్ణుని ధ్యానించుచుండెనను మిషపైఁ గన్నులయెదుటనే జంపించుటా! ఇంతకన్న ఘోరమున్నదా! కుమారా! ఇంతపట్టుదలయేల ? (12)

నామాటవినుము. నీతండ్రి బోధించుమార్గమునఁ బొమ్ము. విష్ణుభక్తి మానుము. నీయభ్యుదయముఁగోరెడి నాకు సుఖమొనఁగూర్పుము. జనకునితో వైరమునీకుఁ దగునా! తండ్రీ! నామాటవినుము హరిభక్తిమానుము,

హిర— ఏమిరా! యిచ్చటనుండి కదలవు. వెంటనే పాములవానిని దోడ్కొనిరమ్ము. (అలంబసుఁడు నిష్క్రమించును.)

లీలా— (13 అనుబంధము.)

నాథా! నాథా! నాయేకపుత్రుని మన్నింపరా! మన్నింపకున్నమా

నె యావజ్జీవము బంది కొనుంచుఁడుగాని నాకు పుత్రశోక ముమాత్రము గల్గింపకుము. (వేడుకొనును.)

హిర—అక్కరాకుము. (దోసివేయును.)

[ప్రవేశము:—అలంబసుకు, పాములవాడు.]

హిర—ఓరీ! నీయొద్ద మంచిపాములేక్షైన నున్నవా!

పాము—చిత్తంబాబూ చిత్తం- మామేలు పావులుండాయి బాబు!

హిర—చూపుము.

పాము—ప్రభోరుసిత్తగించండి ఇదో సూడండి. యీనల్లసుక్కల తా సునండి- నున్నంకొండలోనండి- తిరిగితిరిగి మూన్నెళ్ళు కాసి మరీపట్టుకున్నామండి- ఈగోధుంతాసుకు చూడండిప్రభో మొన్ననండి పదినుందోచోట కూకుంటె యెనకపాటనొచ్చి ముగ్గురుపానాలుచ్చుకొని బొక్కలో దూరిందండి అప్పాకునా నెంతో కట్టపడి దీన్నట్టుకున్నా.

హిర—ఈరెండుపాములచేతను ప్రహ్లాదుని గరిపింపుము.

లీలా—నాథా! నాథా! కరుణింపరా! కుమారునిపైఁగనికరముంప రా! కుమారా! ప్రహ్లాదా! నీవైన నాపలుకులాలింపవా!

ప్రహ్లా—అమ్మా! యేలశోకించెదవు. శేషాహితల్పుండగు నాశ్రీ హరినే ధ్యానింపుచు- స్మరించుచు కీర్తింపుచున్న నన్నీకూర పన్నగంబు లేమిచేయఁగలవు. యించుక యారడిల్లుము కాని నాకెన్నఁడును విష్ణుభక్తి మానుమని బోధింపకుము. వలయు నేని యీదేహమును- ప్రాణమును సమర్పించెదగాని హరి భక్తినిమాత్రము మానజాలను.

లీలా—హాకుమారా! (మూర్ఛిల్లును.)

హిర—ఓరీ! ఆలస్యమేలచేసెదవు. ఆపాములచే వానిఁగఱపింపుము,

పాము—సిత్తం సిత్తం. (నాగస్వరము పట్టుచుండును.)

ప్రహ్లా—పన్నగశయనతల్పా ! కృపాకల్పా ! నిన్ననవరతంబు ధ్యానించుచుంటినని కోపించి జనకుండు పెక్కువిధముల బాధించి నాబుద్ధిమరలఁజాలక నన్నికూ్రరసర్పంబులచేఁ గఱపించుచున్నాడెను. కాని పాపతేనిపై శయనించిన నారాయణా నీపాదభక్తుండనైన నన్నీపన్నగము లేమిచేయగలవు.

పాము—(కరపింపబోవగరుత్మంతుడు పాముల నెత్తుకొనిపోవును.)

పాము—(ఏడ్చుచు) అయ్యో బాబోయ్ బాబోయ్ కొంపమునిగింది. బాబోయ్ నాకూట్లో దుమ్మడింది బాబోయ్ నారెండుపాములు పోయినాయ్‌బాబో !

హిర—(తుళ్లిపడి) ఏమిజరిగినది.

చండా—గరుడుఁ డరుదెంచి పాముల నెత్తుకొనిపోయెను.

హిర—ఎంతపనిజరిగినది. అలంబసా ! వీనినిదోడ్కొనిపొమ్ము. కాలకూటతుల్యమగు విషపానీయమును గొనిరమ్ము.

లీలా—(మూర్ఛదేరి) తనయా ! తనయా ! నన్నిట్లు దుఃఖాంధకారమున విడిపోయితివా !

ప్రహ్లా—అమ్మా ! ఏటికీశోకము యీవిచారము. ఈతనువు శాశ్వతమా! యింతవ్యామోహమున బడితివేమి- రమానాధచరణారవిందములు నమ్మిన నన్నీక్రూరసర్పము లేమిచేయగలవు.(14)

లీలా—(తనయుని కౌగిలించుకొని) కుమారా ! నీ వెట్లాకూ్రరసర్పములబారి పడకుంటివి ?

ప్రహ్లా—ఆ హరి నాసహాయార్థము గరుత్మంతుని బంపియుండెను.

[ప్రవేశము:—అలంబసుఁడు.]

హిర—ఓరీ డింభకా ! యిక జచ్చితివి. ఆవిషంబు గ్రోలెదవా ! విష్ణుభక్తి మానెదవా !

ప్రహ్లా—(విషపాత్రిమందుకొని) జనకా ! యీవిషము నేగాదు మఱి

యేఘోరవిషము నైన ద్రావి మరణించిన మరణింతును గాని హరిభక్తి మానజాలను.

లీలా—నాథా! కరుణింపరా! కనికరమునుపరా! భగవానిని రూపు మాపి వానిని భజించుచున్న కుమారునకు జూపినచోఁ దన యజ్ఞానమునుండి తన చిత్తమును మరలించుకొని విష్ణుభక్తిని మానకుండునా? భగవానిపైఁ జూపదగిన- పరాక్రమము- శౌర్యధైర్యములు- శక్తియుక్తులు- మున్నగునవి కన్నకుమారు నిపై జూపదగునా! నాథా! అనుగ్రహింపుము. అయ్యో కన్నకుమారునికే విషమిచ్చి చంపుటా నాథా! నామొరా లింపుము. యించుకంత కనికరమునింపుఁడు. (15)

హిర—ఓసీ! దుర్మతీ! నీయేమ్ఫులికఁ గట్టిపెట్టి యీవిషము వీని చేఁ ద్రాగించుము. లేదందువా! యీఖడ్గమున కెరయ య్యెదవు.

లీలా—(విషపాత్రలాగికొని) కటకటా! నవమాసములుమోసి కని పెంచి పెద్దగాఁజేసి-వారలవలన సుఖపడవలయునని తలంచుది వసంబులలోఁ గుమారునకు విషమిడి యంతకాలయుంబునకను పుతల్లు లెంద్రైననుండిరా! కుమారా! ... ... ... ...

ప్ర—(విషపాత్ర మందుకొని) జననీ! సందేహింతువేల. తుచ్ఛమగు పుత్రవ్యామోహామునఁబడి సతీధర్మము లేమరదగునా! సతుల కు పతియేగదా దైవము. అట్టిచో నీపతి యాజ్ఞాపించిన ట్లా నరించుట కేటి యాటంకము. (తాగును)

పలా—ఆ! ఆ! త్రా-గు-చుం-టి-వా! (మూర్ఛిల్లును)

లీప్లా—(తల్లిని మూర్ఛదేర్చి) అమ్మా! ఇయ్యదితగునా!

హిర—ఓరీ! మూర్ఖా! ని న్నిప్పుడే ఖడ్గమున కెరజేసినచో నెవ్వడ డ్డము రాగలఁడు.

ప్రహ్లా—జనకా !

కం. బలయుతులకు దుర్బలులకు
బలమెవ్వఁడు నీకు నాకు బ్రహ్మాదులకున్
బలమెవ్వఁడు ప్రాణులకును
బలమెవ్వం డట్టివిభుఁడు బలమసురేంద్రా !

అశ్రీహరియే వచ్చి గాపాడగలఁడు.

హిర—ఛీఛీ! వదరకుము.

శా. నాతో డంబ్రతిభాషలాడెను జగన్నాథుండ నాకంటెనీ
భూతశ్రేణికి రాజు లే డొకడు సంపూర్ణప్రభావుండు మ
ద్భ్రాతం జంపిన మున్ననే వెదకితిం బల్మారు నారాయణుం
డేతద్విశ్వములోన లేఁడు మఱి వాఁ డెందుండురా దుర్మతీ?

నామరూపగుణరహితుండైన నాహరి యెక్కడనుండునురా.

ప్రహ్లా—జనకా ! సర్వభూతాంతర్బహిర్మధ్య సంగతుఁడైన యాశ్రీ
హరిలేని స్థలంబులున్నవా !

మ. కలఁడంభోధిగలండుగాలిఁ గలడా కాశంబునం గుంభినిం
గలఁడగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోతచంద్రాత్మలం
గలఁడోంకారమునంద్రిమూర్తులఁద్రిలిం గవ్యక్తులందంతటం
గలఁడీశుండు గలండు తండ్రి వెదకం గానేల నీయామెడన్.

ఇంకను వినుము.

కం. ఇందుగలఁ డందు లేడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెతకిజూచిన
నందందే గలఁడుదాన వాగ్రణివింటే.

హిర—ఓరీ !

కం. డింభక సర్వస్థలముల
నంభోరుహానేత్రుఁడుండు । ననుచు మిగుల సం
రంభంబున బలికెదవీ
స్తంభంబునఁ జూపఁగలవె । చక్రిన్ గిక్రిన్.

ప్రహ్లా— జనకా! సందేహామే?

శా. అంభోజాసనుఁ డాదిగాఁగఁ దృణప । ర్యంతంబు విశ్వాత్ముఁడై
సంభావంబుననుండు ప్రోడ విపుల । స్తంభంబునం దుండడే
స్తంభాంతర్గతుడయ్యు నుండుటకు నే । సందేహముఁన్ లేదు ని
ర్దంభత్వంబున నేఁడు గానబడు బ్రా । త్యక్షస్వరూపంబునన్.

హిర—ఇందా హరి లేకున్నచో నేను నీచావు నిక్కము (స్తంభము నుగొట్టును.)

(స్తంభముపగులును-నరసింహావతారము.]

హిర—ఓరీ! దుర్మతీ! నాయనుజునిజంపి యెందో దాగియుంటివి. రమ్ము నా ప్రతిపగఁ దీర్చుకొందును. కుమారా! నీవును విరోధిని కీర్తించుచుంటి వనుకొంటిం గాని నాప్రత్యర్థిని-ఎందు జూచినను గానరాని యీమాయకానిని నాకు జూపుదువని తలంపనైతిని. కుమారా! చిరకాలము వర్ధిల్లుము.

నృసింహమూర్తి— ఓరీ దురాత్మా! హిరణ్యకశ్యపా! నేటితో యాయుః కాల మంతరించినది రమ్ము.(తొడలపైనిడకొనిచీల్చిచంపును.)

ప్రహ్లా—(16)

తెర వ్రాలును.





శ్రీ

# సంగీత విష్ణులీలలు.



## వామనావతారము.



[ప్రవేశము:—శుక్రాచార్యులు బలి.]

బలి—గురువర్యా! ఈదినంబున నొక్క యతిథియైన రాకుండుటం జూడ కడుంగడు వింతగాం దోంచుచున్నది.

శుక్రా—వింతగనుండుట కేమున్నది.

చ. అడుగకమున్నె నీవు విపు । లార్థములన్ వెదజల్లి కోర్కెలన్
దడయకం దీర్తునంచు వ్రత । ధారణసేసి చరించుచుండగా
గడచెను పెక్కుమాసములు । గాన దరిద్రులు కంటికైనగ
న్పడరని నూహసేసి నుడు । వందగు దైత్యకులావతంసమా!

కోటి కొక్కడైనను యాచకుం డుండియుండునా యని సందియము నీ కుండిన యుండవచ్చునుగాని నేనుమాత్ర మట్లు దలంపను.

బలి—గురూత్తంసమా! అట్లు శలవీయకుండు. పెక్కురు విప్రులింక ను దరిద్రదేవతాపీడితులై యుండియుందురు. వారెల్లరును యీధనంబులను మన మన్యాయముగా నింద్రునిపీచ మడచి సంపాదించినదని ప్రతిగ్రహింప సంశయపడింకుందురు.

శుక్రా—ఇంద్రాదులనుటచే జ్ఞప్తికివచ్చినది. వారలమాత్ర మేమరి యుండగూడదు సుమా! ఏమందువా! తా మెవ్వరిచేనైన బాధింపబడినప్పుడెల్ల వారాహారియొద్దకేగి కల్లబొల్లి యేడ్పు

లచే నాతని మనంబును గరగించి యాతనిచే నభయంబును బొందుచుందురు. అట్లనే వారు నేఁడును బయలుదేరిపోయి యుండవచ్చును.

[ప్రవేశము—వామనుఁడు]

వామ—(చేయిజాపి)

ఉ. స్వస్తిజగత్త్రయీభువన । శాసనకర్త మహాసమిత్త్రవి
ధ్వస్తనిలింప భర్తకును । దారపదవ్యవహర్తకున్ మనీం
ద్రస్తుత మంగళాధ్వరవి । ధానవిహర్తకు నిర్జరీగళ
న్యస్తసువర్ణ సూత్రపరి । హర్తకు దానవలోక భర్తకున్.

బలి—(పీఠముడిగ్గి తనలో) ఈతఁ డెవ్వఁడో యర్థాపేక్ష నిట్లరుదెంచి నట్లు బొడకట్టుచున్నది. (ప్రకాశముగ) ఈపీఠమం దాసీనులు గండు.

శుక్ర—(తనలో) ఈమరగుజ్జురూపుం డెవఁడోగదా !

బలి—ప్రియా ! యుదకంబును గొనితెమ్ము.

[ప్రవేశము—రాణి యుదకకలశముతో]

(వామనుని పాదములగడిగి తలపై జల్లుకొని నమస్కరించి)

బలి—భూసురోత్తమా !

మ. వడుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవు సం । వాస స్థలం బెయ్యది
య్యెడకున్ నీవరుదెంచుటన్ సఫలమయ్యెన్ వంశమున్ జన్మముం
గడు ధన్యాత్ముఁడనైతి నీమఖము యో । గ్యంబయ్యె నాకోరికల్
గడతేరెన్ సుహృతంబులయ్యె శిఖులుం గల్యాణ మిక్కాలమున్.

వామ—దానవరాజశేఖరా ! యర్థార్థినై నేఁడు నీసన్నిధి కరుదెంచితిని.

సీ. ఇది నాకు నెలవని । యేరీతిఁ బల్కుదు
నొకచోటనక యొంటి । నుండనేర్తు

ఎవ్వానివాఁడనం । చేమని బల్కుదు
నాయంతవాడనై । నడువనేర్తు
నీవడవడియని । యెట్లు వక్కాణింతు
బూని ముష్కోకలఁ । బోవనేర్తు
నదినేర్తు నిదినేర్తు । నని మేల చెప్పంగ
నేరుపులన్నియు । నేననేర్తు
నోరులుగారు నాకు । నోరులకు నేనాదు
నొంటివాఁడ జుట్ట । మొకఁడు లేడు
సిరియుఁ దొల్లి గలదు । చెప్పెద నాకెంకి
సుజనులందు తరచు । సొచ్చియుందు.

ముల్లోకంబుల వన్నె కెక్కిన దాతవని పలువురచే నాలించి నా వాంఛితంబు నీవలన దీరునను తలంపుతో నిచ్చటి కరుగదలంచితిని.

బలి — మహాభాగా ! తమకోర్కె యెద్దియైన దీర్చుటకు సిద్ధముగా నుంటిని యానతిండు చేతులుగట్టుకొని చేసితీరెదను.

వామ — (ఆలోచించుచుండును అభినయము.)

బలి — విప్రపుంగవా ! సందేహించుచుంటి రేల- నసత్యమాడువాఁడ నని తలంచుచుండిరా !

వామ — అట్టి తలంపు లేదు. మున్ను చన్న మీవారందఱును మహాబల సంపన్నులు ఆడినమాట తప్పియెఱుంగరు. ఆవంశమర్యాదను నీవు చక్కగా నిలుపగల సమర్థుఁడవు.

బలి — మహాభాగా సంశయమేలేని చోఁదము వాంఛితంబును దెల్పుడు. దుకూలాభరణములో హయంబులో కరులో రత్నములో కాంచనమో సత్కులసంజాతలగు కన్యలో గ్రామములో భూములో గాక ధరణీఖండమె వాంచించెదరో దెల్పుఁడు. ఇవన్నియును గావలసినను గొనుడు.

వామ—బలీంద్రా! నీ చెప్పిన వస్తువుల బ్రహ్మచారినగు నే నేమిచేసి
కొనగలవాడను. యీవస్తువులలో నా కెద్దియును వలదు.

శుక్రా—(తనలో) ఏమిది. యీతని చరిత్ర మద్భుతముగా నున్నదే.
యీతనికోర్కె యెయ్యదిగా నోపును.

వామ—ఓబలిసార్వభౌమా! నాపల్కు లాలించుము.

గీ. ఒంటివాఁడ నాకు । నొకటి రెండడుగుల
మేరయిమ్ము సొమ్ము । మేరయొల్ల
గోర్కెదీర బ్రహ్మ । కూళటి ముట్టెద
దానకౌతుకసాంద్ర । దానవేంద్ర.

బలి—భూసురోత్తమా! ఇదేటికోర్కె! కోరిన దెద్దియైన యొసంగెద
నని యొకటిరెం డడుగుల నేలమాత్ర మడిగితివేల? ఇంతమా
త్రముకన్న నధికముగా గోరిన నే నొసఁగ లేనని దలంచితివా!
లేక వేరొం డెద్దియైన నడుగవలయునని సంకల్పించికొని మరచి
యిట్లడిగితివా? లేక పరిహాసమునకై యడిగితివా? భూసురో
త్తమా! దాన మడుగునప్పుడు దాతపెంపులనైన దలంప
వలదా!

మ. వసుధాఖండము వేడితో గజములన్ । వాంఛించితో వాజులన్
వెసనూహించితొ కోరితో యువతులన్ । వీక్షించి కాంక్షించితో
పసిబాలుండవు నేర వీవడుగ నీ । యల్పంబు లీపాటిగా
కసురేంద్రుండు పదత్రయం బడుగ నీ । యల్పంబు నీనేర్పునే.

వామ—బలీంద్రా! నీ చెప్పినవాటితో నా కేటినిమిత్తము.

మ. గొడుగో జన్నిదమో కమండలువొ నా । కున్ ముంజియో దండమో
వడుగే నెక్కడ భూము లెక్కడ కరుల్ । వామాక్షులశ్వంబు లె
క్కడ నిత్యోచిత కర్మ మెక్కడ మదా । కాంక్షామితంబైన మూ
డడుగుల్ మేరయ త్రోవకిచ్చుటది బ్ర । హ్మాండంబు నాపాలికిన్

పేరాశబూనిన మానవుఁ డెచ్చోటనైనను సుఖింపఁగలఁడా! దానము పరిగ్రహించుటయె దోషము. అందును తనకు వలయుదాని కంటె నధికంబుగా గొనుట మిగుల పాతకముగాన తనకువలయునంత మాత్రము గైకొని తృప్తినొందవలయును. ఇంతియె గాక,

శా. ఆశాపాశము దాగడున్ నిడుపులే । దంతంబు రాజేంద్ర వా
రాశిప్రావృత మేదినీ వలయ సా । మ్రాజ్యంబు సేకూడియుం
గాశింబొందిరి గాక లైన్యగయభూ । కాంతాదులున్నర్థకా
మాశన్ బాయగనేర్చిరే మునునిజా । శాంతంబులన్ జూచిరే.

రాజేంద్రా! నీవెట్టిదానమైన నీయుఁగల సమర్థుఁడవు అయినను నా తలకుమించిన కోర్కెలఁ గోరదగునా! రాజన్యచూడామణీ! లేదనక నా యడిగిన యర్థంబిచ్చి పుత్తెంచుము.

బలి—వటూత్తంసమా! నీయభీష్ట మెట్టిదైనను దీర్తునని వాగ్దానం బొసంగి వెనుకంజ వేయుదునా! గొప్పవిత్తమును గోరుకొందువేమో యని తరచి తరచి యడుగుచుంటిని. నీ కోరినదెల్ల యొసంగెదను. మరల గోరుకొమ్ము వలదందువా పదత్రంబుల మేర నీకిచ్చుట కాటంకము లేదు.

వామ—బలీంద్రా! అంతియ చాలును మూడడుగుల మేరమాత్ర మిమ్ము.

శుక్ర—(తనలో) ఈవటుని కోర్కెనుబట్టియు రూపమునుబట్టియు జూడగా నీతఁడు మహాపురుషుఁడని తోఁచుచున్నది. అయినను దివ్యదృష్టిని జూచెదగాక. (అభినయము) తెలిసినది. ఈవటుం డానారాయణదేవుడే సందియములేదు. కానున్నది గాకమానదు. బలీంద్రుని ప్రబోధించెదగాక. (ప్రకాశముగ) ఓయీ! నీవీతని కీదానమీయవలదు. (17)

ఈతని వచనంబులఁబట్టి చూడ నీతఁడు భూసురమాత్రుఁడని దోపదు. దేవతలకార్యంబు సాధించుకొఱకునై శ్రీమహావిష్ణు వీరూపంబున నదితిగర్భమున కశ్యపసూనుఁడై జన్మించి యిచ్చోటికరుదెంచెను. నిన్ను వంచించినాడు నీ వెఱుఁగక యిచ్చెదవని బల్కిన మూడడుగులమేరను స్వర్గమర్త్యపాతాళము లాక్రమింపగలఁడు.

కం. ఒక్కపదంబున భూమియు
నొక్కటఁ ద్రిదివంబుడొక్కి । యున్నతమూర్తిన్
దిక్కులు గగనముతానై
వెక్కసమైయున్న నెందు । వెడలెదు చెపుమా!

ఇంతియెగాక నాపల్కులాలింపుము ఈదానమొసంగినందువలనసర్వంబును నాశనముగాగలదు. గావున యేదానమువలన సర్వంబునకును నాశనమరుదెంచునో యట్టిదాన మొసంగకుండుటయె యుత్తమము. అట్లొసంగకుండుటవలన నిసుమంతయు దోసములేదు. ఇందొక్క ధర్మసూత్రమున్న దాలింపుము తనకుఁగల సర్వస్వమును నైదుభాగములుగావించి యందొక్కభాగమును దానధర్మంబులకు వినియోగింపవలయును. అట్టిచోసర్వంబును విష్ణునకు సంతర్పణ మొనరించి బతుగువోలె నెట్లుజీవింపగలవు. కావున నీవీదాన మొసంగనసుము. అయ్యో! అనృతమెట్లాడువాడనందువేమో యాలింపుము.

ఆ. వె. వారిజాక్షులందు । వైవాహికములందు
బ్రాణవిత్తమాన । భంగమందు
జకితగోకులాగ్ర । జన్మలక్షణమందు
బొంక వచ్చునఘము । వొందదధిప.

ఈదానమువలన ప్రాణవిత్తమానములు మూడింటికిని భంగముగలుగు

చున్నది. కావున యీదాన మొసంగకుము నామాటల వాటిం
పుము.

మ. కులముం రాజ్యము తేజమున్ నిలుపుమీ । కుబ్జుండు విశ్వంభరుం
డలతింబోడు త్రివిక్రమస్ఫురణ వాఁ । డైనిండు బ్రహ్మాండముం
గలఁడే మాన్పనొకండు నాపలుకు లా । కర్ణింపు కర్ణంబులన్
వలదీదానము గీనమున్ బనుపుమా । వర్ణిన్ వదాన్యోత్తమా.

బలి—గురూత్తంసమా ! తమరునుడివిన వాక్యంబులెల్ల సత్యంబులు.
కాని- వానినతిక్రమించితినని నాపైఁగినియకుడు నాయీనేర
మును క్షమింపుడు. నీకోర్కె యెట్టిదైనను దీర్తునని వాగ్దాన
మొసంగి రాజ్యముపోవునేమో యను భీతిమై యర్థిని బొమ్మ
నుటెట్లు ? ఎట్టిఘోరపాపులనైన భరించెదగాని సత్యహీనుని
మాత్రము మోవజాలనని మున్ను భూదేవి బ్రహ్మతోఁబలుక
దే. పలికిబొంకకుండుటకంటె పాపమెద్ది ఇంకొక్కవిశేషమున్న
దాలింపుడు. ఎందఱురాజులు మున్నుచనినారలు. వారలీరా
జ్యమును మూటగట్టుకొనిపోయిరే.

శా. కారేరాజులు రాజ్యముల్ గలుగవే । గర్వోన్నతింబొందరే
వారేరీ సిరిమూటగట్టుకొని పో । వంజాలిరే భూమిపైఁ
బేరైనంగలదే శిబిప్రముఖులున్ । బ్రీతిన్ యశఃకాములై
యీరేకోర్కులువారలన్ మరచిరే । యిక్కాలముఁ భార్గవా!

అయ్యాదియేగాక తమరనినట్లుగా నీతఁడు నిరంతరము పవనపర్ణాంబు
భక్షులై జితేంద్రియులై- విపినాంతరాళముల తపంబాచరిం
చుచుండు మహాయోగులకైన లభ్యుండుగాని యావిష్ణువేయైన
చో- నీతనికోర్కెతప్పక నీడేర్పవలసినదేగదా! ఇంతకంటె కర్త
వ్యమున్నదా! ఇంతకంటె నాకింకేమిగావలసినదేమున్నది.

శా. ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై । నంశోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపై । బాలిండ్లపై నూత్న మ
ర్యాదం జెందుకరంబు గ్రిందగుట మీ । దైనాకరంబుంట మే
ల్గాదే రాజ్యము గీజ్యముఁన్ సతతము । కాయంబునాపాయమే.

ఉ. నిరయంబైన నిబద్ధమైన ధరణీ । నిర్మూలనంబైన దు
ర్మరణంబైన గులాంతమైన నిజముల్ । రానిమ్ముకానిమ్ము పో
హరుఁడైనన్ హరియైన నీరజభవుం । డభ్యాగతుండైన నా
దిరుగన్ నేరదు నాదుజిహ్వ వినుమా । ధీవర్య వేయేటికిన్.

గురువర్యా! నన్నుక్షమింపుడు తమపల్కు కెదురాడితినని నాపైఁ
గినియకుడు- ఆవెన్నుడుమాత్రము నన్నే వంచించును. ఆతఁడు
గోరిన యర్థంబొసంగుచుండ నన్నువంచించునా? అట్లువంచించి
నచో నయ్యది నాభాగ్యము గాకుండునే- యేదియెట్లైనను
దానంబు నొసంగెదను.

వామ—బలీంద్రా! ఏమందువు.

శుక్రా—ఏమిది? నాపల్కుల నాదరింపకుంటివి- నావచనంబులకుఁ
బ్రతివచనమిచ్చెదవా! కులగురువునైన మీశ్రేయంబనవరతంబు
గోరెడి నన్నే తిరస్కరించెదవా! మూర్ఖా! ఇందులకుఁ దగిన
ప్రతిఫలం బనుభవింపుము. నావచనంబు లాదరింపక నన్నవ
మానపరచితివి గావున శీఘ్రకాలంబునఁ బదభ్రష్టుండవు
గమ్ము. (నిష్క్రమించును.)

బలి— గురువర్యా!

ఆ. బ్రతుకవచ్చుగాక । బహుబంధనములైన
వచ్చుగాక లేమి । వచ్చుగాక
జీవధనములైన । జెడుగాక పడుగాక
మాటదిరుగ లేరు । మానధనులు.

తమశాపంబునకు గుఱియైనందుల కెంతగా విచారించుచుంటినో యం
తకు వేయిరెట్లు పరితాపమున సత్యమతిక్రమింపజాలనని జెప్పు
చున్నాడను. (వామనుని వైపునకు దిరిగి) వటూత్తంసమా!
జాలమికేల? రమ్ము! నీపాదపంకేరుహంబులఁ గడుగనిమ్ము.

క. రమ్మామాణవకోత్తమ
లెమ్మా నీవాంఛితంబు ॥ లీదనకిత్తున్
దెమ్మా నీయడుగుల నిటురా
నిమ్మా కడుగంగవలయు ॥ నేటికి? తడయన్.

(పాదముల గడగు టభినయము.)

వామ—బలిసార్వభౌమా! ధారాపూర్వకముగ మూడడుగుల మేర ధారవోయుము.

బలి—పంచభూతంబులు-సోమసూర్యాది గ్రహనవకంబును-పరమేశ్వ రుండును- సాక్షులుగ నీవటుశిఖామణికి మూడడుగుల మేర దానమొసంగితిని. (దారవిడువబోవ పడకుండును.)

వామ—(తనలో) శుక్రుడు ధారపడకుండ జేయుచున్నాడు కానిమ్ము (ప్రకాశముగ) రాజేంద్రా! దారపడుటలేదు. యిాచుకతాళు ము. అద్దానిని నేను జక్కజేసెద. (అని దర్భపుడకచే బొడు చును.)

శుక్రుడు—(ప్రవేశించి రోదనముచేయుచు) బలీ! కంటివా! నీచేనెట్టి నదానమిాయకుండ జేయగోరి నీటిధారపడకుండ నిలుపుజేసి నందులకు నానేత్రమునకు మోసముపాటిల్లెను. చూచితివా! యిాతనిశనులు యిప్పటికైనను నామాటవినుము.

బలి—గురువరేణ్యా! నాజిహ్వ తిరుగనేరదు.

శుక్ర—అయిన నాశాపమనుభవింపుము.

(శుక్రుడు నిష్క్రమించును.)

(బలి దాన మొసంగును. వామనుఁడు విశ్వరూపియగును.)

బలి—(ఆశ్చర్యముతో) వింతగానున్నదే ? ఈరోదసీకుహరమంతయు నాక్రమించి దివ్యతేజంబుతోనున్న యమ్మహాభాగుండు-యాచార్యుఁడు నుడివినట్లు నారాయణుఁడే గావలయును.

వామ—బలీంద్రా! ధారాపూర్వకంబుగ దానమొసంగిన మూఁడడుగులకు భూమ్యాకాశములు రెండుపదంబులయ్యెను- మూఁడవ పదమునకు తావుజూపుము. లేకున్న యనృతమాడిన పాపమున బోవగలవు.

బలి—నారాయణస్వరూపా!

ఆ వె. సూనృతంబుగాని । నుడియదునాజిహ్వ
బొంకజాలనాకు । బొంకులేదు
నీతృతీయపదము । నిజమునాశిరమున
నెలవుసేసిపెట్టు , నిర్మలాత్మ.

ఆ. వె. నిరయమునకు బ్రాప్తి । నిగ్రహమునకును
పదవిహీనతకును । బంధనమున
కర్థభంగమునకు । నఖిలదుఃఖమునకు
వెఱవ వదే బొంక । వెఱచినట్లు.

వామ—(పాదమును బలిశిరముపైనిడి) బలీంద్రా! నీభక్తికి - నీసత్యవాక్పాలనంబునకును- నీదాతృత్వమునకును చాల సంతసించితిని. సావర్ణమన్వంతరంబున నీవింద్రుఁడవు గాఁగలవు. అంతపర్యంత మీవు నాపదధ్యానతత్పరుఁడవై సుతలలోకంబున సుఖముండుము.

బలి—(నమస్కరించి) అనుగ్రహింపబడితిని.

ఉ. ఎన్నఁడు లోకపాలకుల । నీకృపజూడని నీవు నేఁడు న
న్నున్నతిసేసి నాబ్రతుకు । నోజయునానతియిచ్చి గాచి తీ
మన్ననలీదయారసము । మాటల పెద్దరికంబు జాలవే
పన్నగతల్ప నిన్నెఱిగి । పట్టిన నాపదఁగల్గనేర్చునే?

భవత్పదారవింద సేవాతత్పరుఁడనై మెలంగునట్లనుగ్రహించితివి. యిం
తియెజాలును- భవదాజ్ఞపై సుతలంబుననే యుండెదను.

(తెరపడును.)





శ్రీ

# సంగీతవిష్ణులీలలు.



## పరశురామావతారము.



[ప్రవేశము:—కార్తవీర్యార్జునుఁడు, వీరసేనుఁడు,]

కార్త—వీరసేనా! ఒక్కనిముషమున- ననేకక్షౌహిణులకు- నెవరికి- నెట్లు నెట్టిసౌఖ్యములు గావలయునో- యట్టిసౌఖ్యము లొనగూర్చి విందొనర్చినాఁడు. ఈజమదగ్ని మహాముని ప్రభావము వర్ణించుట కలవిలేనిదిగదా.

వీర—ప్రభూత్తంసమా! అయ్యది యాతనిప్రభావమని దలంపరాదు అతనిచెంతనున్న సురభియను కామధేనువే సమస్తమును సమకూర్చెను.

కార్త—అట్టిసురభిమాత్రము సామాన్యులకు లభించునా? తపఃప్రభావము గలవారలకుఁగాని యట్టికామధేనువు లభింపదు-

వీర—అట్టి ధేనువు తమబోంట్లకడ నుండదగునుగాని యాకలములఁ దినుచుఁ గాలంబుఁగడపు మౌనిజనులకేల?

కార్త—నిజము! నిజము! కాని యదిమనకెట్లులభించును.

వీర—ఆజమదగ్ని మహామునికడకు ననుఁబంపుడు. యాతనిప్రార్థించి యాధేనువును గొనివచ్చెదను.

కార్త — బహుయత్నలభ్యమైన యాధేనువును నీవడుగుటయే తడవుగా నీకొసంగుదునని తలంచితివా!

వీర — విప్రులు ధనాశాపరులు గావున స్వర్ణమహాత్మ్యమున వారల లోఁబరచుకొనవచ్చును.

కార్త — అరణ్యంబుల కందమూలాదికముల భక్షించుచు తపోనిరతులై యుండువారలకు ధనాశయుండునా?

వీర — దేవా పలుమాటలేల? పైరెండుమార్గములు సరిపడకున్న దండించియైన యాసురభిని దోడ్కొనివచ్చెద. సంశయింపక నన్నుఁ బంపుఁడు.

కార్త — అట్లైన పోయిరమ్ము.

వీరసేనుఁడు — చిత్తము. (నిష్క్రమించును.)

కార్త — అట్టిధేనువు నవశ్యముగా సాధింపవలయును. దండించియైన భూపాలకుఁడు తన దేశంబునగల జనులయొద్దనున్న సువస్తువులఁ గైకొనవచ్చును. దండించి యాధేనువునుఁ గైకొంటిమని పరశురాముఁడు యుద్ధమునకు సిద్ధపడునని దలంచెదనా అయిన నా కేటిభీతి. ముల్లోకంబులు గడగడలాడింపగల మేటిమగండనైన నన్నెదిరించి యీపేదపాఱుఁడు నిల్వనేర్చునా? మొన్న మొన్న దేవేంద్రాదుల నిర్జించి వారలచే సమస్తోపచారములు జేయించుకొనుచున్న యారావణునంతవానినే పట్టి బంధించియుంచితినిగదా! ఇంక నీ పరశురాముఁడా నను నెదుర్కొనజాలును. ఈతఁడొక్కఁడే గాదు- యీతనివంటి పేదపాఱులు పదివేవురు ప్రతిఘటించి నిలచిన నించుకేనియు భీతిల్లను. వారలనెల్ల జక్కాడి యాసురభిని గైకొందును.

[ప్రవేశము — వీరసేనుఁడు.

వీర — మహారాజా! జయము జయము.

కా ర్త — ధేనువును గొనివచ్చితివా? యాజమదగ్ని యద్దానిని నడుగుటయే తడవుగా నర్పించెనా?

వీర — లేదు. లేదు. ఎన్నియోవిధముల బ్రతిమాలితిని కాని లాభ మిసుమంతయును గాన్పింపలేదు. అంత నేనింక చేయునది లేక బలిమి నద్దానిని గొనివచ్చితిని.

(తెరలో) హైహయాధీశ్వరా! రక్షింపుము. రక్షింపుము. పరిమత్తులమై యుద్ధమునకు సిద్ధముగాలేని మమ్ముల నీ పరశురాముం డెదిరించి వధించుచున్నాఁడు.

వీర — (తనలో) కార్యము మించివచ్చినది. పరశురాముని కోపమింత నంతట చల్లారదు.

కా ర్త — సైనికులారా! వెఱువకుఁడు మీమీ బలంబులజూపి యూతని నెట్టులైన నిర్జింపుఁడు. సేనానాయకులారా!

ఉ. బాలుఁడు వెఱ్ఱిబ్రాహ్మణుఁడు । బ్రాహ్మణుఁడైవడినుంటమాని భూపాలురతోడ భూరిజయ । భవ్యులతోడ భయంబుదక్క క య్యాలకువచ్చినాడు మన । యందికఁ బాపములేదు లెందు లెం డేలసహింపభూసురుని । నేయుఁడు వ్రేయుఁడు గూల్పుడిమ్మహిన్.

మంత్రిసత్తమా! కార్యము మించివచ్చినది. రమ్ము సంగ్రామరంగమున కేగి సేనల బుఱికొల్పవత్తము రమ్ము. (నిష్క్రమింతురు.)

ద్వితీయరంగము.

పరశురాముఁడు — కార్తవీర్యుఁడు.

పర — ఓరోరీ! క్షత్రియకులాధమా! పరమనిష్టాగరిష్ఠులై తపమాచరించుచు గాలయాపన మొనరించుచున్న విప్రులధనంబు లపహరింప నెంచితే దుర్మతీ రమ్ము. నిన్నీ భీమసంగ్రామంబున కథావశేషునిగా నొనర్చి నీతోడివారలకు బుద్ధిజెప్పెద.

కార్త — వెఱ్ఱిబ్రాహ్మణుఁడా! యూరక యేల వదరెదవు. రణమున ప్రతిఘటించి నిలచి నన్ను నిర్జింపజాలువాడు లేడు.

పర — ఏమా! గర్వము- శాపచాపబలంబులుగల్గిన భూసురులె నిన్ను సమయింపగలరు దుర్మతి యింతగర్వంబుగల నిన్నూరక విడువరాదు.

కార్త — మేటిబలుఁడగు- త్రిలోకభువనంబుల నుత్తల బడజేసిన- మీ విప్రుఁడగు పంక్తికంధరుని యవస్థ నేమయ్యెనో వింటివా! పెక్కువత్సరంబులు నాచెరసాలలో నివసించెను. అతనిశక్తి యుక్తులకన్న నధికంబగు శక్తియుక్తులున్న రమ్ము.

గీ. లోకములు మూడుగూడ క । ల్లోలమొంద
జేయుపంక్తికంధరుని శి । క్షించినట్టి
జెట్టి నగునన్ను మార్కొను । చేవయున్న
దురమునను నిల్చి జూపుమీ । దోర్బలంబు.

పర — ఛీ! దుర్మతీ! యుద్ధమునకు సిద్ధపడియుండుము. నేడు నిన్ను ప్రేతరాజనిలయంబున కంపినగాని రణరంగమును విడువనొల్లను.

కార్త — పాఱుఁడా! వృథా వదరెదవేల? బ్రాహ్మణుల కుద్భవించి యు- క్షత్రియోచితములగు వీరాలాపముల నీవాడుటఁ జూడ గడుంగడు వింతగానున్నది.

పర — ఓరీ! నృపకీటకాధమా! పూజనీయుల మగు మమ్మెదూలనాడ సాహసించితివా! జన్మముచే బ్రాహ్మణుఁడనై శాపబలంబును ఈశ్వరవరప్రసాదమున క్షాత్రబలంబును బొందియున్నాను. యింకనైనను- నా క్షత్రియోచిత వీరాలాపములకుఁగల కారణమెఱుకబడియెనా!

కా ర్త—(చిఱునవ్వునవ్వి) దత్తాత్రేయవరప్రసాదలబ్ధుఁడైన యీ కార్త వీర్యుని మ్రోలి నీశాపచాపబలంబులు- పనిజేయజాలవు.

పర—(కోపమున) రేదుర్మతీ! (18)

కా ర్త—వెఱ్ఱిపారుఁడా! నీ బెదరింపులకు భీతినొందువారెవ్వరు నిచ్చట లేరు యుద్ధమునకు సిద్ధపడి- రమ్ము. నీ శాపచాపబలంబుల మెంటగలపెద.

పర—ఓరీ! నృపకులాధమా! ఇంక కడ తేరితివి.

(యుద్ధమొనరింతురు. పరశురాముఁడు కార్తవీర్యుని బాహువులన్నిటిని ఖండించి- పిమ్మట నేలగూల్చును.)

పర—దుర్నీతిపరుండగు నీతఁడు కడతేరెను- ఆవృత్తాంతము జనకున కెఱిఁగించి- యాతనికిఁగూడ సంతసమొనగూర్తును.

(నిష్క్రమించును.)



తృతీయరంగము—పర్ణశాల.



(జమదగ్నియు- పరశురాముఁడును యుండగా దెఱలేచును.)

జమ—కుమారా! ఎంతక్రూరకార్యమొనరించితివి. వర్ణాశ్రమకులాచారధర్మంబులు దప్పివర్తింపకుండ శాసించి భూవలయంబు నుబరిపాలించుచు- విపినాంతరాళంబుల పవనపర్ణాంబభక్షులై వసియించున్న- మనబోంట్ల కేకీడునుబొరయకుండ రక్షించుచు సౌఖ్యమొవగూర్చుభూపాలుర వధించుటయే తగునని భావించితివా?

కం. కలవేల్పు లెల్లదమలోతమ

ఫలువంబులు దెచ్చి రాజు ! జేయుదు రకటా

బలువేల్పురాజు వానిం
జలమున నిల్లలపోయి । బంపితిపుత్రా !

పర—జనకా ! క్షమియింపుము. మన సురభిని బలిమినిగొనిపోయెనని యొక్కమునికుమారుఁడు దెల్పినంతననణచుకొనలేనంతటి క్రోధము నన్నావేశించి యాతని వధింపజేసినది.

జమ—కుమారా ! క్రోధమే సర్వనాశనమునకు మూలకారణము-క్రోధముగల మానవుఁడెప్పటికిని స్థిరకీర్తి నార్జింపజాలఁడు- ఓర్పుగలిగి యుండుటవలన సర్వకార్యముల సాధింపవచ్చును. మనబోంట్లకు తాలిమియే ధర్మము.

కం. తాలిమి మనకును ధర్మము
తాలిమిమూలంబు మనకు । ధన్యత్వమునం
దాలిమిగలదని యీశుం
డేలించును బ్రహ్మపదము । నెల్లర మనలన్.

ఇంతియేగాక పద్మాసనంబున గూర్చుండి నిష్ఠాగరిష్ఠుండై తపమాచరించినంత మాత్రమున నే మానవుఁడు పుణ్యలోకమునకుఁ బోవజాలఁడు. అరిషడ్వర్గంబుల జిక్కువడక సర్వభూతంబుల సమదృష్టి నరయుచు తనకెవ్వడేని యెగ్గొనర్చినను నోర్చుకొని యుండి సన్మార్గంబున నడచునో యాతఁడు పుణ్యలోకమును జేరఁగల్గును.

కం. క్షమ గలిగిన సిరిగలుగును
క్షమగలిగిన వాణిగలుగు । సౌరప్రభయున్
క్షమగలుగుతోన గలుగును
క్షమగలిగిన మెచ్చుశౌరి । సదయుఁడుతండ్రీ.

క్షమగలిగినవానికి సిరిసంపదలు గలుగును క్షమగలిగినవాఁడే జగదీశ్వరుని మెప్పొందఁదగువాఁడు క్షమారహితుఁడవై నీకపకార

మొనర్చివాఁడని పట్టపు రాజును వధించితివి. సర్వశాస్త్ర పారంగతుఁడగు విప్రపుంగవుని వధించుటయే మహాపాతకము బ్రాహ్మణుని జంపిన ఘోరపాపంబుకంటెను భూనాయకుని జంపిన పాపమధికము. గాన కార్తవీర్యార్జునుని జంపిన పాపపరిహారార్థమై తీర్థయాత్రకు వెడలిరమ్ము.

క. పట్టపురాజును జంపుట
కట్టలుకన్ విప్రుజంపు । కంటెను బాపం
బట్టిట్టనకను నీవీ
చెట్టసెడన్ తీర్థసేవ । సేయుముతనయా!

పర—(జనకునియెదుట మోకరించి) జనకా! క్రోధరసాయత్త చిత్తుడనై యుక్తాయుక్తము లరయనేరక- "నావిష్ణుః పృథివీపతిః" అను వ్యాకమును దలఁపబోవక-స్వయంకృతాప రాధంబున-నేసంపాదించుకొనిన యీమహాపాతకంబునకుఁ దగినప్రాయశ్చిత్తము విధించిరి యీమహాపాతకము నిముస మాత్రమున పటాచంచలై పరువెత్తునట్లొనర్పగల-చక్కని మార్గమొక్కటి యుపదేశించి- యనుగ్రహించిరి. మహాదురిత పంకమధ్యంబున జిక్కుకొని యిటునటు గదలమెదల జాలనిస్థితిలో నున్న నాకు- యిట్టితరణోపాయ ముపదేశించి నన్ననుగ్రహించినందులకివే నాశతసహస్ర నందనములు- ఇంక నాకనుజ్ఞ యిందు యొక్కవత్సరములో పుణ్యనదీనదంబుల స్నానమాడి- పాప కళంకరహితుఁడనై-తమదర్శనమున కరుదెంచెద. ఆశీర్వదించి పంపుడు- బోయివచ్చెద.

జమ—కుమారా పోయిరమ్ము నేనను యనష్టాన మాచరింరుఁబో మెద. (యిరువురును నిష్క్రమింప తెరవాలును)



## చతుర్థరంగము.

మృతుఁడైన జమదగ్నిమహామునిపైఁ బడియేడ్చుచు- రేణుక ప్రవేశించియుండగా తెఱలేచును.

రేణు—నాథా! పలుకరేమి? తనుపాదరాజీవములే గతియని నెమ్మది సర్వకాల సర్వావస్థల సంస్మరించుచు-తముఁగోడిదేఁగోక మను కొని-యింకను-పదపద్మసేవ లొనర్పవలయునని యుత్సాహిం చుచున్న నన్నిట్లథోగతి పాలొనర్చి దివి కేగితిరా! ఇఁకమనము ద్దుఃఖరాత్రులకు దిక్కెవ్వరు?-మన చిన్నికుమారుఁడగు పరశురా ము నెవ్వారి కప్పగించిరి-అయ్యో! కడుపుదహించుకొని పోవు న్నదే......అల్లనాఁడు దురాత్ముండగు హైహయాధీశ్వరుఁడు కొ సఁగిన యాతిథ్యఫల మీవిధముగా మనలజుట్టుకొనినదా! పర శురామా! హాపరశురామా! నీవేయున్నయిట్టి యాపద తట స్థించి యుండదుగదా! నీవుకార్తవీర్యుని జంపితివని క్రోధమున- నీవూరిలేని తరిహైహయులెల్ల గుమిగూడి యిచ్చటికరు దెంచి- తపోనిష్టాగరిష్ఠుఁడై యున్న నీజనకుని వధించినారు- పరశురామా! నాఁడు కార్తవీర్యుని జంపుటగాదు నేఁడు నా కిట్టి దుఃఖమొనగూర్చిన వారిని జక్కాడి-సాహస మొనగూర్పు ము...అయ్యో! పరశురాముఁడేఁడీ!-ఏఁడీ! (మూర్ఛిల్లును)

(ప్రవేశము:—పరశురాముఁడు)

పర—(అనుబంధము) నేఁడేలనోగాని పెక్కుదుర్నిమిత్తములు దోఁచు చున్నవి. ఎట్టివార్త వినవలసివచ్చునోగదా! (ముందుకునడచి రక్తమునుజూచి) ఇదేమి- ఈరక్తప్రవాహమేమి ? (పరికించి) జనకా! (మూర్ఛిల్లును)

రేణు—(మూర్ఛదేరి పరశురాముని గాంచి) తనయా! పరశురామా! వచ్చితివా! (మూర్ఛిల్లును)

పరశు—(మూర్ఛదేరి) అమ్మా!

రేణుక—కుమారా! గంటివా! నీజనకుని యవస్థ నీజనకుని హితులైన హైహయులొనర్చిన యుపకారము. తమతండ్రిని సమరంబున మ్రిందించినందులకు నీజనకుని వారు తుదముట్టించిరి. వైరీతినకార్యాశించుచు నాయెదుటనే యిట్టి యకృత్యమునర్చిరి.

పర—(ఉగ్రుడై మండిపడుచు) ఏమేమీ! యర్జునుని పుత్రులా! యిట్టి యకృత్యమొనర్చినది. కానిమ్ము. వారలనెల్ల యీదినంబుననే మట్టుబెట్టెదను. ఓరీ! దురాత్ములారా! మీకు మరణమాసన్నమైనదని తెలిసికొనుడు. ఒక్క యీ దురాత్ములనేగాక-నృపాలురు లేకుండునట్లెల్లరవధించి తీరెదను. మద్యమాంసంబుల కుత్తుగబాటిగా మెసవి భోగపరాయణులై దాము దినుచున్నదెల్ల ప్రజలకష్టార్జితమను మాటమరచి యుక్తాయుక్తములు విచారింపని భూపాలురుండిననేమి? లేకున్ననేమి? ఓరీ! రాజాధములారా! భూమిపై నొక్క మగపురుషుడైన లేకుండునట్లొనరించి నాజనకుడు స్వర్గమునకేగుట కనువగు సోపానములుగా మీ శవముల బరచియుంచెదను. అమ్మా యూరడిల్లుము.

గీ. మాటవరుసకు నొకరాజ ॥ మాత్రుడేని
మిగులకుండంగనెల్లర ॥ మృత్యువాత
ద్రోసి నా జనకునకు సం ॥ తోషమెసగ
తర్పణము జేతు వారి ర ॥ క్తంబుతోడ.

జననీ నాకనుజ్ఞయిమ్ము!

రేణు—కుమారా! నీజనకుడు నన్ను విడచినందులకే చింతించుచున్న నన్ను విడచిపోయెదవా!

పర—అమ్మా! భూపాలురం జక్కాడకున్న నాదుఃఖానలము జల్లా రదు.

రేణు—కుమారా! పోయిరమ్ము.

పర—మహాప్రసాదము. (నిష్క్రమించుచుండ తెరవ్రాలును.)



పరశురామావతారము.

పంచమరంగము.



[ప్రవేశము—పరశురాముఁడు.]

పర—మున్ను నాజననితోఁ జేసిన ప్రతిజ్ఞాప్రకార మిర్వదొక్కమా ర్లీధరావలయంబునంగల భూపాలురవధించితిని. భూభారముడిపితిని. ఇంక నిచ్చోనే నొనరింపవలసిన కార్యములన్నియు ముగిసినవి. ఇంక నాజనకునకుఁ బుణ్యలోకములు ప్రాప్తించుటకొకయాగమొనరించి నా బాహువిక్రమంబున నార్జించిన యీరాజ్యం బొక్కవిప్రునకొసంగి జనసంపర్క మిసుమంతయులేని మహేంద్రపర్వతముపైఁ దపం బొనరించుకొనియెద.

(నిష్క్రమించును. తెరవ్రాలును.)





శ్రీ

# సంగీత విష్ణులీలలు.



## రామావతారము.



### పర్ణశాల.

(సీతారామలక్ష్మణులు ప్రవేశించియుండగాఁ దెఱలేచును.)

రాము—అన్నా లక్ష్మణా!

చ. జనకుని యాజ్ఞ మౌళినిడి । స్వాంతమునన్ బెగడొందకుండ యీ
వనములఁ జేరి రక్కసుల । బల్వురఁ జంపి జయంబుగాంచి స
న్మునివరులిచ్చు దీవనలు । మోదముతో గొనినట్టి హర్షమే
మనమున నుండదయ్యె గుణ । మాన్యుఁడు తండ్రి దివంబుజేరుటన్.

ఇంతలోననే యింతయగునని యెన్నడైన ననుకొంటిమా!

సీ. పదునాల్గువర్షముల్ । పదునాల్గునిమిషంబు
లట్లు కాలక్షేప । మమరఁ జేసి
తనకోర్కెలీడేర । ననిమదిలోనకై
కమ్మమిగులసంత । సమ్ము నొంద
నిత్యసత్యవ్రత । నియుతాత్ముఁడౌతండ్రి
ఘనతరానందంబుఁ । గనుచునుండ
ప్రజలెల్లమారామ । భద్రుఁడెంతెంచెమా
భాగ్యమేమనఁజూడ । వచ్చునుండ

గురువరేణ్యుఁడు సమ్మని । వరులతోడ
వడిగజనుదెంచిదీవన । లిడుచునుండ
నాపురంబునుఁ జొరనున్న । నాదుకోర్కె
హా! స్వప్నమైపోయెబ్రతుకెందు । కక్కటకట.

సీత—నాథా! మామగారదృష్టవంతులు- అరువదివేలవత్సరము ల ఖండవైభవంబుతో భూమండలంబెల్లఁ బరిపాలించి గణింపరాని యశోలక్ష్మినార్జించి విష్ణ్వంశసంభూతులరగు మిమ్ముఁబుత్రులుగాఁ బడసి నేటికి విధిప్రేరణముచేదివం బలంకరించిరి. అట్టివారి మరణమునఁగూర్చి మనము సంతసింపవలయును- కాని- కలిగినసంతానములో నొక్కఁడైన కడదినంబున దగ్గర లేకునికి మాత్రమే గాఢవిషాదమున కెడమిచ్చుచున్నది.

రాము—కల్యాణీ! నీవనినది నిక్కువము. కన్నతండ్రిని పిడికెడు బుగ్గి సేయు నదృష్టము నురదృష్టవంతులమగు మాకు లేకున్న మానె- యీకాలమునకు భరతశత్రుఘ్ను లిరువురుకూడ లేక పోవలయునా?

లక్ష్మ—అగ్రజా! గతించినదానికై వగచుచు గూర్చుండిన మనకు మిగులఁ బ్రమాదమురాఁగలదని శంకించుచున్నాను. కారణ మేమందురా! అదిగో యాఛాయఁ దిలకింపుఁడు. ఆవచ్చెడి జవ్వని యెవ్వతెయైయుండనోపును. ఇది మహారణ్యముగదా! మానికాంతి లీలీరుసశృంగారదేవతల వోలె నుండురుగదా! ఇట్టి నవనవాగ్రకోమలు లీపాంతమున కిట్లొంటరిగ రాజాలరుగదా! అట్టియెడ సీతరుణీమణి మనమున నెట్టిభయమునులేక- యాత్మరక్షణమునకొక యాయుధమైనను లేక- యెట్లిచ్చటికి రాగలిగియుండును. ఇదేదియో రాక్షసమాయగా నుండ నోపునని నాతలంపు.

[ప్రవేశము:—శూర్పణఖ]

శూ — (తనలో) మునులు జెప్పిన రామలక్ష్మణులు వీరైయుందురు. నా కుమారుని దమపొట్టబెట్టుకొని మునిముచ్చులవోలె కూర్చుండిరి. ఈక్షణము వీరలపైఁబడి పచ్చివక్క "కటక్కు" నకొఱికినట్లీ యిరువురరుఁగొఱికి నాదుఃఖానలముఁనుఁ జల్లార్చుకొనియెదను. (సమీపించి పరికించిచూచి) ఎంతసుందరాకారులు. వీరలఁ జక్కాఁడుటకుమారుగా- పెక్కు ముద్దులిడుకొనవలయుననుమోహ ముదయించుచున్నది. వీరిలోనొక్కనిఁ జేరదీసితినా—నాజన్మసార్థకమగును. (యింకను సమీపించి) సుకుమారులారా! మీరెవ్వరు.

లక్ష్మ — జవ్వనీ! తండ్రియానతిచే నరణ్యావాసమొనరింపవచ్చిన శ్రీరామచంద్రుఁడతఁడు. నేనాతనితోఁగూడ నరుదెంచి యాతనికి వలయు పరిచర్య సేయుచుందును. నన్ను లక్ష్మణుఁడందురు. నీవెవ్వతెవు. ఇట్లొంటరిగ నిమ్మహారణ్యంబున నేలదిమ్మరుచుంటివి.

శూర్ప — (రామునితో) మారసుకుమారసుందరా! లోకపాలకులమని మేటి బిరుదములఁగన్న యింద్రాదులఁ బెక్కుమార్లు రణరంగమందుఁ జిత్తోస్మియనిపించిన లంకాధినాథుఁడగు రావణుని సోదరిని. ఇంక నావచ్చినపని వినుము. మునులవలన నీవుసుందరుఁడవనివిని నాజన్మము సార్థకపరచుకొనవలయునని యిట్లరుదెంచితిని. నన్నుఁ జేఁబట్టి యాదరింపుము.

తే. వలచివరియించుకొన్న దం । పతులసౌఖ్య
మంతు దరిలేనివారాసి । యట్టులుండు
రసికవరున కేభ్రాసి పేరి । యసిలభింప
బెరుగు వడ్లనుగలిపిన । విధముదనరు.

నీకీమెతో సహవాసము నేఁజెప్పిన రెండవవిధమున నున్నదిగావున నన్ను జేకొనుము. సతియుండగా నీవేలనంకువేమో వినుము; యీమెవలన బాధలేకుండ మ్రింగివేసెదను.

సీత — నాథా! యీదుర్మతి సిగ్గుబిడియములవిడచి రాక్షసకృత్యములకు వన్నెబెట్టునట్లుగా మాట్లాడుచున్నది.

రాము — సుందరీ! నీవంతశ్రమపడనేల? నామాట యటుంచుము. ప్రస్తుతము మామఱదలు చెంత లేకునికి గష్టించుచున్న నా తమ్ముఁడగు లక్ష్మణునివరింపుము.

శూ — ఛీ! ఛీ! ఏమంటివి! నిన్ను మనసారవలచి ప్రేమించినకాంతను తృప్తిపరుపలేక పరునియొద్దకుఁ బొమ్మనుచుంటివా! యిది యేనా! నీమగతనము. ఇట్టివాడవగు నీతో నాకేమిపని. (లక్ష్మణునితో) లక్ష్మణా! నీవంగీకరింతుననుము. (సమీపించును.)

లక్ష్మ — (దూరముగ నేగి) తాళు. తాళు.

గీ. పెద్దవాడగురాముని । విడచి వారి
దాసు వరియించి దాసివై । దనరగలవె
యతనినేగోరి వరియించి । నట్టులైన
వారితో బాటు నీకు సపర్య జేతు.

ఈయంశమును నీమది నాలోచించుకొనుము.

శూ — కొఱమాలిన యొక్కమగపురుషునకై దాసిని కాజాలను. రామా! పెక్కుమాటలేల నన్ను పరిగ్రహింతువా! పరిత్యజింతువా!

రాము — (అపవారించి) సోదరా! యీమెకు బుద్ధిసెప్పుము (ప్రకాశముగ) శూర్పణఖా! నాసోదరుఁడే నీకు సుఖకరమగుమార్గము నుపదేశించును.

శూ—అదే నాకుఁ గావలసినది రమ్మా మార్గముపదేశింపుము.

(శూర్పణఖ లక్ష్మణుఁడు నిష్క్రమింతురు.)

[పునఃప్రవేశము:— లక్ష్మణుఁడు]

లక్ష్మ—అగ్రజా! ఆదురాత్మురాలి ముక్కు చెవులగోసి వికృతాకారిణిఁ జేసివచ్చితిని.

రాము—విరుద్ధపు గోర్కెల గోరువారల కయ్యది తగినశిక్షయే... (తెరలో కలకలము) ఏమాకలకలము (ముందునకుజూచి) పెక్కురు రాక్షసు లరుదెంచుచున్నారు. వారివెంట శూర్పణఖ గూడనున్నట్లున్నదే (జూచి) అగునగును. వీరెల్ల రామె పరాభవ మాలించి మనల బరిమార్చుటకై వచ్చుచున్నట్లున్నారు. లక్ష్మణా! ఆబాణాసనమందుకొనుము. నేపోయి వారలరూపుమాపి వచ్చెద. మీావదినెను జాగరూకతతో నరయుచుండుము.

[కార్ముకమందుకొని నిష్క్రమించి రెండవప్రక్కనుండి ప్రవేశించును]

సీత—(ఎదురేగి) నాథా! రాక్షసులెల్లఁ గథావశేషులైరిగదా!

రాము—కొందఱు మాత్రము భీతిల్లి పరువులిడిరి. పెక్కురురక్కసులీభూదేవికి బలియైరి. నాయకులగు ఖరదూషణు లిరువురును మడసిరి.

[తెరలో]

శూ—ఖరదూషణాదులు సులభముగ నీచే పడిరని సంతసింపకుము నాసోదరుఁడగు రావణునితోఁ జెప్పి మీాకు దగినంత పరాభవ మొనర్పక నిద్రింపను. యాహారముఁ గొనను.

లక్ష్మ—ఓసీ! పోవే నీబెదరింపులకు భీతిల్లువా రెవ్వరు!

సీత—ఇయ్యది కారణంబుగ ముందేమేని ప్రమాదములు గలుగునని భీతి జనించుచున్నది.

రాము—కల్యాణీ ! భీతిల్లకుము. లక్ష్మణా ! కాలోచితకృత్యములఁ దీర్చుకొనుటకు వేళయైనది లోనికేగుదము రండు.

(నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

## ద్వితీయరంగము.

పర్ణశాల.

[సీతారాములు ప్రవేశించియుండ తెఱ లేచును.]

రాము.—కల్యాణీ ! నీవు నాచెంతనుండుటఁజేసి యరణ్యవాస క్లేశమిసుమంతయుఁ దోపకున్నది- అభ్యాసవశమున నరణ్యావాసమే సుఖముగా నున్నది.

సీత—ఏమిసుఖము- ఎప్పు డేరక్కసుని మూలమున నెట్టి యిక్కట్లు వాటిల్లునోయని భీతిల్లుచునే యుందును.

రాము—భీరురాలా! ఈపరిసరమున గల రక్కసులందఱును పరలోకము కేగిరి. మనచేఁ బరాభవింపబడిన శూర్పణఖ యెందో భీతితో నణగిమణగి యున్నది.

[ప్రవేశము:—లక్ష్మణుఁడు.]

లక్ష్మ — అగ్రజా! ఫలపుష్పాదులదెచ్చి పర్ణశాలయందుంచివచ్చితిని.

సీత—నాథా ! అల్లదే ! ఆచాయజూడుము. ఆబంగారు లేడిని- అదే "చంగుచంగు" మని యాలతాకుంజముచెంగట దాటుచున్నది. అయ్యది నాచెంగట నున్న జెలికత్తియలు లేనిలోపము దీరగలదు. అద్దానిని దెచ్చి యొసంగరా ? (19)

రాము—ప్రియా! అట్లైన గొనివచ్చెద.

లక్ష్మ—అగ్రిజా! వలదువలదు! ఎక్కడనైన బంగారులేడి యుండునా! మనల మోసగింప నెవ్వఁడో యీరూపమున వచ్చి యుండనోపునని యూహించుచున్నాఁడను.

రాము—లక్ష్మణా! నీవనినట్లుగా రక్కసుఁడైనఁ బరిమార్చెద లేకున్న భూజాతకోర్కెఁ దీర్చెద రెండును మన కవశ్యాచరణీయములే గదా! మీవదినెను జాగరూకతో జూచుచుండుము. పోయివచ్చెద. (నిష్క్రమించును.)

సీత—(రాముని పరికించునటుల నటించుచు) ఆపసిడిమృగమును బట్టుకొనుటకై యెంతశ్రమ పడుచుండిరి...అయ్యయ్యో! నిష్కారణముగా నాథుని నలయించిన దాననైతినే?........ఏమిది-లేడియు మీయన్నగారుఁ గూడ గాన్పించుటలేదు. లక్ష్మణా! పరికించుము.

(తెరలో) లక్ష్మణా! రమ్ము! రమ్ము!!

సీత—(భయప్రకంపితయై) లక్ష్మణా! వింటివా! మీయన్నగారి యార్తనాదము. త్వరితముగా నాతనికి సహాయమొనరింపఁ బొమ్ము, కదలుము. ఇంకను యిచ్చటనే యుంటివా ?

లక్ష్మ—అమ్మా! జగదేకపూజ్యుఁడగు శ్రీరామచంద్రునకెన్నఁడైన నాపద కలుగునే- జననీ! సందేహింతువే? అన్నగారి పరాక్రమమిమాత్రమెఱుఁగవా? అంతియెగాక- ఆయార్తారపము సోదరునిదైనట్లు దోపదు. రక్కసు డెవ్వఁడో యట్టులరచి యుండును.

సీత—నిన్నటిదనుక నామాటలు శిరసావహించు నీవు- నేడేల నా పల్కులయెడ నాదరముంపకుంటివి. కష్టదశయందున్న యగ్రజుని యార్తనాద మాలించియు పోకున్న నినుజూడ నేడు

నీ కెద్దియో విపరీతబుద్ధి బుట్టియున్నదని తోచుచున్నది......
(ఆలోచించి) తెలిసెను నీమర్మాగ్రపుటాలోచనము- రాముడు
పరలోకమున కేగిన నన్నుపరిగ్రహింపవలయునని దలంచితివా!
దుర్మతీ! జీవనము నైన విడతునుగాని నీకుమాత్రము వశ్య
రాలనుగాను......ఎక్కడిసోదరులు- ఒక్కసోదరుఁడు రాజ్యమ
పహరించెను. వేరొక్కడు భార్యనపహరింప దలచుచున్నాడను.

లక్ష్మ—జననీ! కఠోరవాక్యములాడెదవేల? అన్నయానతినతిక్రమించి
వర్తింపభీతిల్లుచుంటిని. నిన్నిచ్చట నొంటరిగా దిగవిడిచి చనిన
నేయాపదయైన కల్గునేమోయని భీతిల్లుచుంటిని. కాని-నీకఠో
రవాక్యముల విని సహింపఁజాలకుంటిని- జాగరూకతతో నుం
డుము. పోయివచ్చెదను. (నిష్క్రమించును.)

[ప్రవేశము:—రావణుఁడు.]

రావ—(తనలో) ఏమీ లతాతన్వీసౌందర్యము. ఇట్టి త్రిజగన్మోహిని
నెందును జూచియుండలేదు- ఈమెను నాయర్ధాంగిగాఁ జేసి
కొనిన నాజన్మ సార్థకమగును. (20)

సీత—మునీంద్రా! నమస్కారము.

రావ—మనోవాంఛఫలసిద్ధిరస్తు లతామణీ నీ పేరెవ్వరు- నీ నాథుఁ
డెవ్వఁడు. నీసుందరాకార, భీకరాటవి పాల్జేయుచుంటివేల?

సీత—మునీంద్రా! మామామగారగు దశరథేశ్వరుని పంపున వర
ణ్యావాస మొనరింపవచ్చిన నాపతితో నరుదెంచితిని. నావి
భుఁడును- మఱదియు నరణ్యాగ్నుల కేగిరి వారిరువురును కొల
దికాలంబున నరుదెంచి తగురీతిని సత్కరింతురు అంతవఱ కీ
యాసనమున గూర్చుండుడు.

రావ—తరుణీమణీ! నీవృత్తాంత మెఱింగించితి నింక నావృత్తాంతముఁ

గూడ వినుము కమలభవుండు నాపితామహుండు- జగద్విశ్రుతుఁడగు విశ్రవసుండు నాజనకుఁడు- స్వర్ణవికారమైన లంకాపురంబు నివాసము- ముల్లోకంబు లొక్క-పెట్టున నాక్రమింపజాలిన దైత్యవల్లభుఁడను రావణుఁడనువాడను. ఇంక నావచ్చిన పనివినుము లోకంబులనెల్ల నీవు చక్కని దానవని శూర్పణఖచే విని- విరహాభరంబున ధైర్యంబుడిల్లవోవ మన్మథపేరితుఁడనై యిట్లరుదెంచితిని-నన్నుఁ జేకొనుము-లంకారాజ్యమునకు నిన్నధికారిణిగా నొనర్చినీకనుసన్నల మెలగుచుండెదను.

సీత—ఛీ దురాత్మా! యించుకతాళుము నా విభుఁ డరుదెంచినంతనే నిను జక్కాడి ముక్తికాంతను నీ కర్పింతును. (21)

రావ—తన్వీమణీ! నీవంగీకరింపకున్న బలిమినైన గొనిపోయెదను. ఇంతకును నీవు నా నిజరూపమును జూడకుండుటచే నట్లనుచుంటివి. ఇదే చూడుము నా నిజరూపము. (అని నిజరూపము దాల్చును.)

సీత—రామభద్రా! హారామభద్రా! (మూర్ఛిల్లును.)

## తృతీయరంగము—యుద్ధభూమి.

[ప్రవేశము అంగదుఁడు.]

అంగదు—శ్రీరామచంద్రుని బాహువిక్రమము వర్ణింప నెవ్వనితరము. ముల్లోకంబుల నొక్క-పెట్టున నిర్మూలింపజాలిన బలుఁడగు కుంభకర్ణుని నొక్కనిముషమున గూలనేసెను. అతికాయుం డాదిగాగల వీరులెల్లరును గతించుటచేతను కుంభకర్ణుఁడు కుంభినిపై గూలుటచేతను రావణుడిప్పుడు ఱెక్కలు తెగినపక్షివోలె నిస్సహాయుఁడై యున్నాఁడు. ఇట్లైనను వెనుకంజయిడక యింకను

మాశ్రీరామభద్రుని జయింపవలయుననియే యద్దురాత్ముఁడు యత్నించుచున్నాఁడు. అతని పట్టుదల కెంతయును మెచ్చ వచ్చును.

(తెరలో) అంగదా! ఎచ్చటనున్నావు

అంగ—విభీషణా! ఇటురమ్ము!

[ప్రవేశము విభీషణుఁడు.]

అంగ—విభీషణా! విశేషములేమి? నాకొఱకై వెతకుచుంటివేల?

విభీ—ఓయీ! కార్యము మించివచ్చుచున్నది. శుక్రానుమతంబున నాసోదరుం డిప్పుడు పాతాళహోమ మాచరించుచున్నాఁడఁట. అయ్యది నిర్విఘ్నముగా నెఱవేరిన నాతని జయించుట దుర్ఘటము మన మెల్లిన నద్దానికి విఘ్న మాపాదింపవలెను.

అంగ—సిద్ధముగా నుంటిని. కాని కార్యసాధనోపాయము దోచుట లేదు.

విభీ—గొప్పపరాభవమును జూచినగాని యాతఁడు నిష్టనుండి లేవజాలడు. కావున నీవాతని యంతఃపురంబునకుఁబోయి యాతనిభార్యనుచెఱగొని యాతని యెదుటఁ బరాభవింపగడగుము.

అంగ—పాపము శమించుగాక. పాపము శమించుగాక. విభీషణా! నన్నిట్టి నీచకార్యమున కేలని యోగించెదవు.

విభీ—అంగదా! నిన్నట్టి నీచకార్యములకు నియోగింతునా! ఇందొక్క రహస్యమున్న దాలింపుము. నీవు వాలికి మండోదరియందు బుట్టితివి కావున నీవామెనంటిన దోషములేదు. అందునను పరమాత్మస్వరూపుఁ డగుశ్రీరామకార్యార్థ మెట్టిపనియైన ఱయు నరింపవలయును. ఇంతకును మరొక్కడీకార్యమును నిర్వహింపఁజాలఁడు.

అంగ—మంచిది అవశ్య మాతని హోమమునకు విఘ్నమాపాదించి వచ్చెదను.

విభీ—రమ్ము! శ్రీరామచంద్రునికడ ననుజ్ఞగొని తత్కార్యమును సాధింపబోవచ్చును. (నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

తురీయరంగము.

[రావణుఁడు దీక్షతో హోమము జేయుచుండగా మండోదరి నీడ్చుచు నంగదుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

అంగ—ఓన క్తంచరాధమా! అమితబలుఁడగు సోదరుఁడు వడినను శౌర్యశాలియగు సుతుండు గూలినను మూలబలంబులెల్ల నాశనమైనను పట్టుదలవీడక నిట్టింకను హోమమాచరించుచుంటివేల? ఆప్తులను బంధులను సుతులను గోలుపోయి జనశూన్యమగు రాజ్యము నింకను పరిపాలింపవలయునని దలంచితివా? యిదే చూడుము.

గీ. మున్ను శ్రీరాము నెటులనో । మోసగించి
యవనిజాతను గైకొంటి । వంతెగాని
నేడు బాహువిక్రమమున । నీదుసతిని
బట్టితెచ్చితి చూడుమో । పంక్తికంఠ.

మాయాకృత్యవిశారదుండైన మారీచు సహాయమున భూజాతను దొంగిలించి తెచ్చితివి గాని నేను నీభటులెల్ల మాన్పడి చూచుచుండ బాహుబలంబున గొనివచ్చితిని. పరాక్రమమున్న బలమున్న శౌర్యమున్న రమ్ము నాతో బోరనడచి నీభార్యను సంరక్షించుకొనుము. రమ్ము త్వరపడుము. నిజభార్యను సంర

క్షించుకొననేరని నీకీపాతాళహోమ మెందులకు. పరకాంతా కర్షణ ప్రయత్న మెందులకు లెమ్ము.

మండో—ప్రాణేశ్వరా! నిశ్చింతమై యొక్క వనచరుండు నీభార్యను పరాభవించుచుండ చూచుచు నూరకుందువా? అప్రయోజకునివలె నీభార్య నొరులు గొనిపోయి పరాభవించుచుండ నూరకుందువా? పగవానిచేబడిన నాదెస చూడవేల? వీని నేల వధింపవు. కొరవిచే తలగోకగొనినట్లు సీతామహాసాధ్విని గొని తెచ్చితివి లంక కిట్టిచేటొనగూర్చితివి. కుమారుని సోదరుని జంపుకొంటివి. నిజభార్యాపరాభవమును కండ్లారగాంచుచుంటివి—జీవితేశ్వరా! యిట్లూరకుండుట నీకుదగునా?

రావ—(తనలో) సర్వనాశనమైనది. (లేచి ప్రకాశముగ) దురాత్ములారా! చచ్చితి రిదే కాచుకొనుడు. (బాణముల విడచును.)

అంగ—(తనలో) చేయవలసిన కార్యము నిర్విఘ్నముగా నను కొనిన రీతిగా జరిగినది. (నిష్క్రమించును.)

మం—(సమీపించి) నాథా నాతుదిపల్కు లాలింపుడు. విష్ణుస్వరూపుడగునమ్మహాత్మునితో బోరి జయించుట దుర్లభము. యింకనైన నాపల్కు లాలించి సీతామహాసాధ్విని రామచంద్రున కర్పింపుము. యాతని శరణువేడుము.

రావ—ప్రియా! నీపల్కులు నాకు రుచింపవు. ఏలనందువా వినుము.

గీ. ఎఱుగుదును నేను రాముఁడే । హరియటంచు
యతనిచే నాకు చావు స । త్యంబటంచు
పూర్ణముగ నేనెఱింగియే । పోవుచుంటి
ముక్తికాంతను క్షణములో । బొందుకొఱకు.

నాయొనర్చుచున్న యీహోమవిధ్వంసముగూడ నామరణమునే సూ

చింపుచున్నది. గెలిచిన కాంతామణిని గెలువకున్న ముక్తికాంతను వరింపగలను పొమ్ము. నీవు మాకు నీతు లుపదేశింపవలసినకాలము రాలేదు.

మండో—నాథా వలదు. వలదు. హా (మూర్ఛిల్లును.)

రావ—(తనలో) ప్రేమపాశ మిప్పటికి దెగింపుకొంటిని. రణభూమికేగెదగాక. (నిష్క్రమించును.)

తెర వ్రాలును.



పంచమరంగము —యుద్ధభూమి.



[ప్రవేశము శ్రీరాముఁడు విభీషణుఁడు.]

శ్రీరా—ఓయీ! విభీషణా! ఇదేమియో మాయగానున్నది. ఎన్నిమార్లు దునిమినను శిరంబులు మరల నుద్భవించుచున్నవి.

గీ. తలలు చేతులుఁ దునిమి దో । ర్బలముజూపి
విసివితినిగాని బ్రత్యర్థి । పీసమైన
గాసినొందడు యింకనే । కరణివీని
దునిమిపెట్టుటలో మదిలోన । దోపదయ్యె. .

విభీ—స్వామీ! చతురానన వరప్రసాదమున వీనినాభియం దమృతము కుండలాకృతినున్నది. అయ్యది కారణంబున దలలుచేతులు తెగియు మరల నుద్భవించుచున్నవి. కావున నాభిచీల్చుటకు యత్నింపుము.

[ప్రవేశము—రావణుఁడు.]

రావ— విభీషణా! ఎంత జేసితివి! నారహస్యములన్నియు నెఱింగించితివా? యింటిగుట్టుదెల్పి లంకకు జేటొనగూర్చెదవా? రామా!

ఈశరమును దప్పించుకొనజాలవు. యీయస్త్రమున నీవో నేనో గూలవలయును. (శరము విడచును.)

రాముఁడు—(తప్పించుకొని) శరసంధానమన్న సామాన్యముగ నెంచితివా? యింక నాయస్త్రప్రభావమును జూడుము.

మ. చపలత్వంబున డాఁగి హేమమృగముం । సంప్రీతి బుత్తెంచుటో
కపటబ్రాహ్మణమూర్తివై యబలనా । కాంతారమధ్యంబునం
దపలాపించుటయో మదీయశిత ది । వ్యామోఘబాణాగ్ని సం
తపనం బేగతి నోర్చువాఁడవు దురం । తంబెంతయున్ రావణా!

(శరమును విడుచును.)

రావ—శివ-శివ! శి-వ-శి-వ—(చనిపోవును.)

రాము—దుష్టసంహారమైనది. యింక నారాక కాంక్షించువారలకు ముదము గలుగఁజేసెదను. (నిష్క్రమించును.)

తెర వ్రాలును.





శ్రీ

# సంగీత విష్ణులీలలు



## కృష్ణావతారము.



### ప్రథమరంగము.

[ప్రవేశము—చంపక నీలవేణి రాధ కమల]

రాధ—చంపకా! బాలకృష్ణుని చర్యలన్నియు నద్భుతము గానున్నవి. చంటిపాపఁడై చను గుడుపవచ్చిన పూతన యనురక్కసి నుక్కడంచెను. తృణావర్త్తాదుల యమలోకంబున కనిపెను. యీతని చర్యలన్నియునుఁ గడుంగడు జోద్యంబులయ్యెడి.

చంపక—ఇట్టి యమానుషకృత్యంబు లాచరించుటకు జాలిన పూరుషు డెవ్వఁడు ఈతఁడు నిక్కముగా దేవాంశసంభూతుఁడగును.

కమల—అయిననేమి, యింత దుండగీఁడుతనమా!

నీల—దేవాంశసంభూతుఁడని మీకుఁదోచినచో యీయిండ్లగల పాలుపెరుగులన్నియు నాతనికి సమర్పించుఁడు. సామంతులు గనుక మీరట్లుచేయగలరు కాని మాబోంట్లట్లాచరింపలేరుగదా!

కమల—ఓసి నీపాలుపెరుగులు పాడుగాను! గోపబాలురతోఁగూడి-చెప్పుటకు సిగ్గగుపనులగూడ జేయుచున్నాఁడు. బాలుఁడని

మన్నించి యూరకొందుమన్న యాతని యల్లరిచేష్టలు సహింపనీయకున్నవి.

నీల—రమ్మా యశోదమ్మగారివద్దకేగి యాతనికొంటెపనులన్నియును జెప్పిశిక్షింపఁ జేతము. (తొందరపడి కమలను లాగును)

రాధ—ఏమే! నీకంత తొందర. మేమును- మీతో నరుదెంచెదము. మాపాలు పెరుగుల నొక్కనాడేని మిగుల్చుటలేదు. యీవృత్తాంతమా యశోదమ్మతో జెప్పవలయునని యేబయలుదేరితిమి.

కమల—అట్లయిన రండు పోవ్రదుపోవుచున్నది.

చంపక—నడువుడు. (పరిక్రమింపగా తెఱలేచును.)

[ప్రవేశము—యశోద]

యశో—ఏమే చంపకా! గుమిగూడి నల్వురును- యిల్లరుదెంచిరి- రాకరాక వచ్చితిరి గూర్చుండుడు.

చం—ఏమున్నది. బాలకృష్ణుని యల్లరిపనులంతకంత కధికమగుచున్నవి. పాలుపెరుగుల నొక్కదినమునైన మమ్మదిననీయడు.

నీల—పాలుపెరుగులే కాదు! మీగడ- వెన్న- నేయి- కంటికగుపడనీయడు- వెన్న దిను చుండ నెవ్వరైన గాంచి యడ్డువచ్చిన- దిట్టి జిక్కులబెట్టి జిక్కక తనదారిని బోవును.

రాధ--యశోదా! ఏమిచెప్పుదును మీకృష్ణుని చర్యలు.

క. మగువా నీకొమరుఁడు మా
మగవారటుపోవఁజూచి । మంతనమునకుఁ
దగజేరిపొందనడిగెను
జగముల మున్నిట్టిశిశువు । చూచినవారే!

కమల—తల్లీ! మీకృష్ణుని దుండగము వర్ణింప నేరి తరము. మాకు మారై జలకము లాడుచుండ నట కేతెంచి సమీపముననున్న వలువనుకొని పరుగులిడెను.

క. వేఁజనితి తప్పిబడెనని
ప్రాబల్యముతోడవచ్చి । భవనము వెనుకన్
మాబిడ్డ జలకమాడఁగ
నీబిడ్డను వలువఁదెచ్చె । నెలతుకతగునే?

చంపక—తల్లీ! ఏమని విన్నవింతురు.

క. వెన్నదినఁగఁ బొడగనిమా
పిన్నదియడ్డంబువచ్చి । పిరిదికిఁదివియన్
జన్నొడసిపట్టిజీరెను
చిన్నికుమారుండె యతఁడు । శీతాంశుముఖీ!

కమ —

క. కమలచ్చి కలిగెనేనిం
గుమతురు గట్టుదునుగాక । గోష్ఠకులనగుచున్
బమగుల వాడలపైఁ బడ
విమతురె రాకాంతలెందు । విమలేందుముఖీ!

యశో—ఏమేమో! మావానిమీద నేరములు జెప్పెదరు. కాని నాకుమారుడెప్పుడును నిట్టియల్లరి చిల్లరిపనులకుఁ బోవఁడు. మాకృష్ణుఁడునన్ను విడచి యొక్కనిముషమైన నుండఁడు.

తే. గీ. అన్యాయులుఁగాఁడు తనయుఁత । నాకుచూపు
మంచివాఁడీతఁ డెగ్గులు । మానరమ్మ
రామలార త్రిలోకాభి । రామలార
తల్లులార గుణవతీమ । తల్లులార.

మీరందఱే వచ్చి యిట్లు చెప్పుటచే మీరందఱును గుమిగూడి యాలోచించుకొని యిట్టినేరములు మావానిపై మోపుచుండిరి.

నీల—అమ్మా నిక్కమే వచించెదము. నీవు నీకుమారుని క్రమశిక్ష

లో నుంపకున్న మేమీపురంబున కాపురముండ లేము॥

క. ఓయమ్మ నీకుమారుఁడు
మాయిండ్లను పాలుపెరుగు । మననీడమ్మా
పోయెద మెక్కడికైనను
మాయన్నల సురభులాన । మంజులవాణీ!

యశో—కమలా! నీలవేణీ! మావానిపై నలుగకుఁడు- కృష్ణునితగు
నట్లు మందలించి బుద్ధిసెప్పెదను యిప్పటికేగుడు.

కమ—మంచిది. (గోపికలు నిష్క్రమింతురు.)

యశో—నాకనులముందటనే యెల్లప్పుడాడుచుండును. అట్టి కృష్ణుఁ
డెట్లు గోపికల నగచాట్లబెట్టియుండును ఏమో! ఏసమయ
ముననో నాకనుగప్పి సందుచేసుకొనిపోయి యల్లరిసేసియుం
డును. లేకున్నచో వారు నాతో నేల యీరీతిజెప్పుదురు.

[ప్రవేశము:—కృష్ణుఁడు, బల రాముఁడు, గోపాలుఁడు]

గోపాలు—అత్తా! చూచేవా! కిట్టయ్యబావేం జేసేడో-

యశోద—యేమిచేసినాడు.

కృష్ణుఁడు—(చెప్పవలదని బెదరించుచున్నాఁడు.)

గోపాలు—అదుగో! అదుగో! చెప్పితే కొడతానంటున్నాఁడు నేను
చెప్పను- నీవులేనప్పుడు నన్ను చావగొడతాడు-

యశో—బలరామా! నీవుజెప్పుము.

గోపా—నేనే చెప్తతాను. మేమాడుకుంటూయుండగానే- యొకచోట
పెద్దకొయ్యతీసి- మన్నుముద్దలు ముద్దలుగాఁ దీసికొని—

కృ—(బెదరించును.)

గో—నీబెదరింపులకు- నాకు భయములేదు. అత్తా! చెప్పితే నమ్ము
తావోలేదో అమట్టముద్దలు- గుటకు. గుటకు- మింగేశాడు

వద్దువద్దంటే నామాటవినక నన్నుతిట్టి మన్నంటే నాకిష్టమని యింకా పెద్దముద్దలుతీసి మింగేడు.

యశో— బలరామా! నీవాతని వారింపలేదా!

బల—(తనలో) పరాత్పరునిమహిమ నెఱుఁగువాడెవ్వఁడు. (ప్రకాశముగ) తినవద్దని జెప్పితిని.

యశో—ఏమిరా! కృష్ణా! నీదుండగము లెక్కువయగుచున్నవి. గోపికలందఱును నీపై నేమేమో నేరములజెప్పిపోయిరి. నేడు నీయన్నయును యీబాలుఁడును మన్నుదినుచుంటివని జెప్పుచున్నారు. మన్నేల భక్షించెదవు.

క. మన్నేటికి భక్షించెదు
నున్నియమము లేలనీవు । మన్నింపవు నీ
యన్నయు సఖులును జెప్పెద
రన్నా మన్నేలమఱి ప । దార్థములేదే.

కృ— (తల్లిదగ్గరకేగి) అమ్మా! నామాటలాలించుము. నేనెన్నఁడును మన్నుదినలేదు. మన్నుదినుటకు వెఱ్ఱివాఁడనా! వీరిరువురకును నీవు నిన్ననాకు పెట్టినవెన్న పెట్టలేదనుకోపమున నీతో నిట్లు జెప్పుచున్నారు.

యశో—ఏదీ నీవదనము మన్నుదినిన మట్టివాసనయెచ్చటికిఁబోవును.

కృ— శా. అమ్మామన్నుదినంగనే శిశువనో । యాఁకొంటినో వెఱ్ఱినో
నమ్మంజూడకు వీరిమాటలు మదిన్ । నన్నీవుకొట్టంగ వీ
రిమ్మార్గంబుఘటించిచెప్పెదరుకా । దేనిన్ మదీయాస్యగం
ధమ్మాఘ్రాణముసేసి నావచనముల్ । దప్పైనదండింపవే.

యశో—(తనలో) ఇదేమి- యీతనివక్త్రమునందు సమస్తలోకంబులును బ్రహ్మవిష్ణుమహేశ్వరులును సప్తమహాఋషులును కులపర్వతంబులును- యిదియదియననేల? సకలచరాచర భూతం

బులతో నిండియున్న యీజగంబెల్లను గాన్పించుచున్నది. అదే నేను నానాథుఁడు గోవులు గోపికలుగూడ యీతనిముఖంబున నే యున్నారము. ఇట్టిమహామహుఁడు కేవలము బాలుఁడని దలంపరాదు. సర్వవ్యాపియగు నా శ్రీమహావిష్ణు వీరూపంబున నవతరించియుండెను.

(42 అనుబాధము.)

ఆ. వె. ఏమహాత్ము వలన । నీవిశ్వరూపంబు
గానఁబడియె బుద్ధి । కంపమయ్యె
నామహాత్మువిష్ణు । నఖిలలోకాధారు
నార్తులెల్లఁ బాయ । నాశ్రయింతు.

కృ—(తనలో) ఈమహాసాధ్వి నన్ను పరమేశ్వరునిగా దలంచుచు-తనకుమారుఁడనుట మరచినది. యోగమాయాప్రభావమున నీమెను భక్తిమార్గమునుండి మరల్పవలయును. (అట్లొనర్చును)

యశో—కృష్ణా! నీవు మన్నుదినలేదు నీయన్నయు నీగోపాలుఁడను కల్లలాడుచుండిరి. రండు మీకన్నము బెట్టెద. (నిష్క్రమింతురు.)

తెరవ్రాలును.

## ద్వితీయరంగము.

[ప్రవేశము:—యశోద]

యశోద—కృష్ణుని దుడుకులు మేరమీరుచున్నవి. ఈకుర్రని చేష్ట లన్నియును సహింపరాకున్నవి.

సీ. బాలుఁడీతండని । భావింతునందునా
యేపెద్దలును నేర । రీక్రియంబు

వెలపెలుంగుటకునై । వెలపిం తునందునా
కలిగిలే కొక్కడు । గానిలేదు
వెలపుతోనాబుద్ధి । వినిపిం తునందునా
తనుదానమైె బుద్ధి । దప్పకుండు
నొండ్లాలుఁగక యింట । నుండెడునందునా
జొచ్చిచూడనిదొక । చోటులేదు
తన్ను నెవ్వరైన । దలపోయ బారెడి
యోజలేదుభీతి । యొకటియెలుఁగ
డెలమినూరకుండ । డెక్కసక్కెముఁలాడు
బట్టిశాస్తిసేయు । భంగియెట్లు.

ముద్దుకుమారుఁడని మందలింప కూరకొన్న కొలఁది యాతని యల్లరి పనులధిక మగుచున్నవి. ఉట్టిపై బెట్టియుంచిన వెన్ననంతయు దినివైచి భాండమును బగులగొట్టి పారిపోయెను. ఇట్టితుంటరి యెట్టిపనులనైన జేయగలడు బట్టిశిక్షింపవలయునని యత్నించు చుంటిని. ఇంతలో నా యింగిత మెఱింగి కాబోలు పరువెత్తెను. ఎక్కడికి కేగగలడు. ఈసమీపముననే యెక్కడనో నక్కి యుండును. నలుమూలలజూచి అదే! ఆమూలనేమియు నెఱుఁగనివానిపోల్కి గూరుచున్నాడు. పరువున బోయి యాతని బట్టుకొని బంధించి యుంచెదను. (నిష్క్రమించును.)

[ప్రవేశము:— కృష్ణుఁడు రోలీడ్చుకొనుచు.]

కృ—ఎంతయో విశ్వప్రయత్న మొనరించినను బట్టుకొని యీరోటను బంధించెను. ఎవ్వరిచేతను బంధింపబడనినేను- నేటికీమెచే యీరోటికి బంధింపబడవలసి వచ్చినది. కానిమ్ము- యిప్పుడు మద్దివృక్షములై బడియుండి నారాకకై నిరీక్షించుచున్న నలకూబరమణిగ్రీవులకు శాపవిమోచనం బొనరించెదను.

[మద్దిచెట్లమధ్యనుంచి దోలీడ్చును. చెట్లుకూలిపోవును చెట్ల నుండి నలకూబర మణిగ్రీవు లుద్భవింతురు.]

నల—శ్రీకృష్ణా!

కం. భువనములు సేయఁగావఁగ
నవతీర్ణుఁడవైతి కాదె। యఖిలేశ్వరయో
గివరేణ్యా విశ్వమంగళ
కవిసన్నుత వాసుదేవ। కల్యాణనిధీ!

మణి—ఓ దేవదేవా!

శా. నీపద్యావళు లాలకించుచెవులున్। నిన్నాడువాక్యంబులున్
నీపేరన్ బనిసేయుహస్తయుగముల్। నీమూర్తిపైఁజూపులున్
నీపాదాబుల పొంతఁ బ్రమొక్కు శిరముల్। నీసేవపైఁ జిత్తముల్
నీపై బుద్ధులు మాకునిమ్ముకరుణన్। నీరేజపత్రేక్షణా!

శ్రీకృష్ణ—నలకూబరమణిగ్రీవులారా! నారాక కాంక్షింపుచు నన్నే మిామానసమునందు ప్రార్థించుచునుండుటం జేసియు నాదర్శనమగుటచేతను మీారు కృతార్థులైరి.

క. తమతమ ధర్మముదప్పక
సములైనచు నమ్మితిరుగు। సభ్యులకును బం
ధమునను జూడగవిరియును
గములాప్తుఁడు వెడలవిరియు। ఘనతమము క్రియన్.

యింకమీారు మీాలోకంబునకేగుడు.

మణి-నల—మహాప్రసాదము. (నిష్క్రమింతురు.)

[ప్రవేశము — నందాదులు.]

గొల్లఁడు—మద్దిచెట్లు గూలినవి- (కృష్ణుని సమీాపించి బాధనము లూడ్చి.) బాబూ నీకేమియు దెబ్బతగుల లేదుగదా! దైవమాయచే నిప్పటికి మనకృష్ణునికిసుమ్మంతయు యొగ్గుగలుగలేదు.

నందు—ఇంకనిచ్చోట నుండఁగూడదు. ఎవ్వరోయొకరు మనకృష్ణుని కెగ్గుసేయవలయుననియే దలంచుచుండిరి.

ఉ. ఇక్కడ నుండురే మనుజు । లీమన కృష్ణున కెగ్గుసేయగా
రక్కసురాలు జన్నొసగె । రాలపయిన్ సుడిగాలివీఁచె బై
కిక్కిరియన్ దరుల్ వడిచె । గేశవసత్కృప దప్పె జాలునే
డెక్కడికైనఁ బోవలయు । నింకిటగోపకులార వింటిరే !

2 గొల్లడు—తప్పకుండా పోవాలి.

3 వాడు—నాకు తోచింది సెప్తానండి.

క. కసవుగల దిరవుపసులకు
లసదద్రినదీమహీజ । లతికావలిపెం
పెసగును గాపురమునకును
బొసగును బృందావనంబు । వోదడచ్చటికిన్.

నందు—నీవు చెప్పినది గూడ నాలోచింపవలసినదే. మనగోవులకుఁ గావలసినది కసవు- అయ్యది కొల్లలుగ లభించు స్థలము బృందావనము- గాన నింక సంకోచింపబనిలేదు- మారుమాటాడకయచ్చటి కేగుటకు ప్రయాణముకండు- (నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

## తృతీయరంగము.

బృందావన సమీపారణ్యము.

ప్రవేశము;—బ్రహ్మ.

బ్రహ్మ—ఈతని మహత్వమెద్దియో పరికింపవలయునని గోవులను గోపాలురనుఁగూడ గృహాయందుంచి వైచితిని. ఆగోవులకొఱకై కృష్ణుడు నన్నుజేరి యడుగకమానడు- అదే వెదకుచున్నాడు-

శా. కర్ణాలంబిత కాకపక్షములతో । గ్రైవేయ హారాళితో
స్వర్ణాభాసిత వేత్రదండకముతో । సత్పింఛ దామంబుతో
బూర్ణోత్సాహముతో దృతాన్నకబళో । త్ఫుల్లాబ్జహస్తంబుతో
దూర్ణత్వంబున నేగెలేగలకునై । దూరాటవీవీధికిన్.

ప్రచ్ఛన్నముగ నీతని వెంట నాటి ఏమి సేయునో బరికించెదగాక.
(నిష్క్రమించును.)

[ప్రవేశము:—కృష్ణుఁడు.]

కృ—(తనలో) ఎంత వెదకినను గోవులజాడయే గాన్పింపకున్నది. (ఆలోచించి) ఆ. తెలిసినది. చతురాననుండు నాప్రభావ మెఱుంగగోరి గోవులను గోపాలురను దాచినైచెను. మోస మునకుఁ బ్రతిమోసము బన్నవలెను. నేనే గోగోపకుల రూపంబున వర్తించెదను. (నిష్క్రమించును.)

[పునఃప్రవేశము :—బ్రహ్మ]

బ్రహ్మ—వెరపింపబోయి వెరచినట్లైనది. కృష్ణుని వంచింపదలచి విశ్వ ప్రయత్న మొనర్చి విఫలీకృతమనోరథుండనై యాతనిచే వంచింపబడితి. గోగోపాలురను మాయముచేసిన తానే గోగోపాలుర రూపంబుల ధరించి చరించుచున్నాడు......ఆహా! ఈతని మహిమార్ణవంబున నాని కూడ యాది శేషునకైన దరమా. ఈ కృష్ణుని జూచుచు నానందించు యీ గోపాలురే ధన్యులు.

ఉ. ఎన్నడునైన యోగివిభు లెవ్వని । పాద పరాగమింతయున్
గన్నులగానరట్టి హరి । గౌగిటఁ జేర్చుచుఁ జెట్టఁబట్టుచున్
దన్నుచుఁ గ్రుద్దుచున్ దగులుచున్ । బైఁబడిగూడియాడుచున్
మన్ననసేయు వల్లవకు । మారుల భాగ్యము లింతయొప్పునే.

అదే కృష్ణుఁడొంటిగ నందు గూర్చుండెను. నేబోయి యాతనియొద్ద నానేర మొప్పికొని కృతార్థుఁడ నయ్యెద. (నిష్క్రమించును)

[తెరలేవఁగా కృష్ణుఁడు ప్రవేశించును]

కృ — చతురాననుండు గోగోపుల దాఁచివైచి దాదాపుగా నొక్క- వత్సర మయ్యెను. ఇంకను నాతనికి నాప్రభావ మెఱుకబడి నట్లుఁ దోఁపదు. (ఎదుటజూచి) అదే బ్రహ్మగా రరుదెంచు చుండిరి.

[ప్రవేశము :— బ్రహ్మ]

బ్రహ్మ — శ్రీమన్నారాయణా! నానేరమును సైరింపుము. నిన్నెఱుంగలేక నీయెడ మూఢుఁడనై వర్తించితిని. (24)

సీ. శంపాలతికతోడ । జలదంబు కైవడి
మెఱుఁగు టొల్లియతోడ । మెలఁగువాని
కమనీయ మృదులాన్న । కబళ నేత్ర విషాణ
వేణు చిహ్నంబుల । వెలయువాని
గుంజావినిర్మిత । కుండలంబులవాని
శిఖిపింఛ వేష్టిత । శిరమువాని
వనపుష్పమాలికా । వ్రాతకంఠము వాని
నలినకోమలచర । ణములవాని
కరుణగడలుకొనిన । కడగంటివాని గో
పాలబాలుభంగి । బరగువాని
నగుమొగంబువాని । నను గన్నతండ్రిని
నినుభజింతు మ్రొక్కి । నీరజాక్ష.

మ. ననుమన్నించి భవజ్జనంబులకు నా । నందంబు నిండించు నీ
తఱి రూపంబిదె నామనంబున కచింత్యంబయ్యె నీయుల్లస
ద్ఘన విశ్వాకృతి నెవ్వఁడోపు నెఱుఁగ । న్గైవల్యమై యొప్పు నా
త్మనివేద్యంబగు నీదువైభవమ్ము చం।దం బెట్టిదో యీశ్వరా!

క. తారాతుషారశీకర
భూరజములకైనలెక్క ౹ బుధు లిడుదురు భూ
భారవతీర్ణకరుఁడగు
నీరమ్యగుణాలి నెన్న౹నేరరగణ్యా.

ఓపురాణపూరుషా !

మ. ఒకఁడై యుంటివి బాలవత్సములలో ౹ నోప్పారితీవంతటన్
సకలోపాసితులౌ చతుర్భుజులునై ౹ సంప్రీతినే గొల్వఁగా
బ్రకటశ్రీగలవాఁడవైతి వటుపై ౹ బ్రహ్మాండముల్ సూపి యొ
ల్లక యిట్లొక్కఁడవైతి నీవివిధరీ ౹ లత్వంబు గంటింగదే.

శా. దేవా నీచరణప్రసాదకణ ల౹బ్ధింగాక లేకున్న నొం
డేవెంటంజను నీమహామహిమ నూ౹హింపంగ నెవ్వారికిన్
నీవారై చనువారిలో నొకఁడనై ౹ నిన్ గొల్చు భాగ్యంబు నా
కీవే యిప్పటి జన్మమందయిన నొం౹డొందైననో యీశ్వరా !

మ. నిను హింసించిన పూతనాదులకు ము౹న్ నీమేటి సంకేత మి
చ్చిన నీకుం బురదారపుత్రగృహ గో ౹ శ్రీప్రాణదేహాదు లె
ల్లను వంచింపక యిచ్చు గోపకులకున్ ౹ లక్ష్యింప నేమిచ్చెదో
యని సందేహముతోఁ జుచున్నది ప్రపన్నా నీకరక్షామణీ !

లోకేశ్వరా ! భవద్దివ్యపాదారవింద మరందపానప్రమత్త చిత్తుఁడనై మెలంగునట్లనుగ్రహింపుము.

కృ — చతురాననా ! సంతసించితిని యిందు నీయొనర్చిన దేమియును లేదు. అయినను నీకోరిన వరమిచ్చితిని.

బ్రహ్మ — నారాయణా ! పురాణపూరుషా ! భవద్దర్శనంబున కృతార్థుడనైతిని. సెలవొసంగిన నాలోకంబున కేగెదను.

కృ — మంచిది బోయిరమ్ము.

బ్రహ్మ — (నిష్క్రమించును).

కృ— బ్రహ్మచే దాచియుంచఁబడిన గోగోపాలురదే వచ్చుచున్నారు. నామాయ నుపసంహరించి వారల నెదుర్కొందును. (నిష్క్ర)

తురీయరంగము—యమునానది.

[ప్రవేశము :—కృష్ణుడు- కాళీయునిపై తాండవమాడుచు యిరువురు నాగాంగనలు- చెరియొక వైపునను జేరి స్తుతించుచుందురు]

నాగ—దేవదేవా! అరిషడ్వర్గంబుల జయించి యింద్రియనిగ్రహము గలవారలై మునివృత్తిని కాననంబున మెలంగుచుండెడి యోగీశ్వరులకైన దుర్లభుండవగు నీవు- యీఫణీంద్రునిపై నటించుచుంటివి యిట్టి మహద్భాగ్యమొంద నీఫణి పూర్వ మేమి యొనర్చెనో.

ఉ. ఎట్టి తపంబుసేసెనొకొ । యెట్టి సుకర్మము లాచరించెనో
యెట్టి నిజంబువల్కెనొకొ । యీఫణిపూర్వభవంబునందు ము
న్నెట్టి మహానుభావులకు । నెన్నడు జేరవగాని నీవు నే
డిట్టి వినోదలీల దల । లెక్కి నటించెద వీ ఫణీంద్రుపై.

ద్వితీయ— కృపాపూర్ణభావా!

మ. బహుకాలంబు దపంబుసేసి వ్రతముల్ । వాటించి కామించి నీ
మహనీయోజ్వల పాదరేణురణ సం । స్పర్శాధికారంబు శ్రీ
మహిళారత్నము తొల్లికాంచెనిదె, నే । మంబేమియు౯ లేక నీ
యహి నీపాదయుగాహతింబడసెనే । డత్యద్భుతం బీశ్వరా!

1 నా—యదుకులభూషణా! నిజభుజగర్వప్రపంచితచిత్తుండైన మద్విభుడెన్నియో నేరము లొనరించెను. తండ్రి కుమారుని తప్పిదముల మన్నించి మంచిమార్గమునకు దెచ్చువరీతిని మాపతిని సన్మార్గమున బెట్టి మాకుం బతిభిక్ష పెట్టుము.

క. నేరములెన్న నెక్కడివి । నేమువలంచువలంపుగోపలల్
నేరుపులున్నవే సుతుల । నేరమి తండ్రులు దోసిబిపుచ్చరే
నేరముసేయువారి ధర । నీపతు లొక్కకమాటు గావరే
నేరముగల్గు మద్విభుని । నేఁడిటు గావఁగదే కృపానిధే.

2 నా—ఈకాళీయుఁడు పిన్నవాఁడనియు పాపకార్యము లాచరింప లేదనియు వక్కాణింపజాలము. అయినను-వైధవ్యమను దుఃఖ సముద్రమున మునుఁగనోపక నీపదాబ్జంబుల బట్టివేఁడుచుంటిమి. మాకుంబతిభిక్ష పెట్టి మమ్మనుగ్రహింపుము.

శా. బాలుండీతఁడు మంచివాడనుచుఁ జెప్పన్ రాము క్రూరుండు దు
శ్శీలుండౌ నవునైననేము సుభగ । శ్రీబాసి వైధవ్యదు
ష్టాలంకారముబొందనోడెద మనా । ధాలాప మాలింపవే
చాలున్నీపద తాడనంబు పతిభి । క్షంబెట్టి రక్షింపవే !.

ప—కమలామనోహరా !

ఆ. వె. మమ్ముపెండ్లిసేయు । మాపాణివల్లభు
పాణిమిచ్చి కావు । భక్తవరద
నీవుసేయుపెండ్లి । నిత్యంబు భద్రంబు
చిన్ననాటిపెండ్లి । పెండ్లి కాదు.

ఇరువురును—లక్ష్మీకళత్రా ! జోహార్ ! జోహార్ ! (24)

కృ—నాగాంగనలారా ! చింతింపకుడు. కాళీయా ! నీ భార్యలపాతి వ్రత్యప్రభావమున రక్షింపఁబడితివి.

కం. గోవర్గముతో మనుజులు
దావునకరీమడుగు నీరుఁ । దగదిందుండన్
నీవును నీబాంధవులును
నీవనితలు సతులుజనుడు । నేడంబుధికిన్.

నాపదచిహ్నములఁజూచి గరుడుఁడు నీపై రాకుండును. గావున నిర్భీతి
తో రత్నాకరంబున నివసించి సుఖముండుము పొమ్ము.

కాళీ—మహాప్రసాదము. (తెర వ్రాలును).



## పంచమరంగము—బృందావనము.



[అక్రూరుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

అక్రూరు—కంసుని కవసానకాలము సమీపించినది. లేకున్న నిట్టివిపరీతపు టాలోచనలు పుట్టియుండవు. ధనుర్యాగమను మిషపై రామకృష్ణుల మధురానగరంబునకు రప్పించి వధింపనెంచి యున్నాఁడు కాని, పూతన తృణావర్తాది రక్కసుల పెక్కుర జంపిన యాకృష్ణుని- యాదివ్యపూరుషుని- మర్దింపగలఁడే! రామకృష్ణులు నిక్కముగ నాతో మధురానగరంబున కరుదెంచి- కంసుని గర్వమడచి- జక్కాడెదరు...అయిన నాకేల యీతర్కవితర్కములు నావిధ్యుక్త కార్యమాచరించి- యా గోపాలకృష్ణుని దర్శించి కృతార్థుఁడనయ్యెద...ఏమో సందియముగానున్నది- దుర్మార్గుడగు కంసునిచే పంపబడినవానినని దలంచి- నీచునిగాదలంచునో లేక- సర్వభూతాంతర్బహిర్మధ్య సంగతుల నామూలాగ్రముగా నెఱిఁగినవాఁడగుటఁ జేసి- నా యంతరంగిక భావమును నెఱింగి నన్ను సుజనుఁగాదలఁచి యాదరించి మన్నించునో... తప్పక యాకృపాసింధులుఁడు నన్ను సుజనుఁగా దలచి యాదరించును. తనపాదసరసీరుహంబుల శిరమిడి నమస్కరించి నన్ను నికృష్ణునిగా దలఁచునంతటి వాఁ డాతఁడుగాఁడు.

ఇట్లు తర్కవితర్కములఁ జేయుచు నిచ్చటనే గూరుచుండనేల. శీఘ్రముగ నేగి రామకృష్ణుల దర్శించి వారలకు నావచ్చినపని యెఱిఁగించి మధురాపురమునకు దోడ్కొని పోయెదగాక.

(నిష్క్రమించును).

తెర వ్రాలును.

[ప్రవేశము — కంసుడు]

కంసు—(తనలో) పదివేవ్వరు బాలురనైన నిముషమాత్రమున నుక్కడగింపజాలు కువలయాపీడ మీయిరువురిబాలకులచే పరలోకమున కేగినది. ఎవ్వరు నాయభీష్టము లీడేర్పఁగిన విక్రమశాలులో యట్టి చాణూరముష్టికులు. రామకృష్ణులచే మడసిరి. యింకనీబాలకు జంపుటెట్లు. వీరలనే జంపకున్న నాకు మనశ్శాంతి లభించునా? వీరలు జీవించియుండ నాకు మనఃశాంతి లభింపదు. నాయీనిశితకరవాలముననే వారల జక్కాడెదగాక.

[ప్రవేశము — కృష్ణుఁడు]

కృ—మామా! వెఱగున నిందు దాగొనవచ్చితివా! సంగ్రామవిజయులమగు మమ్మభినందించుటకు మారుగా దూషించి యవమానింపనెంచితివా! మమ్ములజంపుమని సైనికుల కాజ్ఞయొసంగితివా! ఎంతశ్రమపడితివి మామా! ఇంతమాత్రపుబనికై సైనికులేల రమ్ము. నీశూరత్వమును జూపుము.

కం—వచ్చితివా! రమ్ము. నీకోరినట్లు నీతో. బోరొనర్చి నిన్నంతకాలయమున కనిపెదను. వెఱగుపడిరాలేదు. యీఖడ్గమును గొనిపోవ నిచ్చటికరుదెంచితిని. యీఖడ్గముచే నిన్ను వధించి. నాపగ సాధించుకొనియెదను.

కృ—నీఖడ్గము నను దాకజాలదు.

కం—చూడుము. (అని ఖడ్గము నెత్తి వేయబోయి కత్తి కృష్ణుడుగా మారుటజూచి, పారవైచి- తనలో) యిదేమి వింతగానున్నది. (ప్రకాశముగా) ఓరీడింభకా! ఖడ్గము చేగాకున్న ముష్టిఘాతముల నినుజంపితీరెదను. (అని దరిజేరబోవును).

కృ—మామా! తత్తరింపకుము! యీదేహముతో నీవు నన్ను సమీపింపజాలవు.

కం—ఛీ! వాచాటా! నోరుమూయుము. (ముందునకుజూచి తనలో) నలువంకల కృష్ణుడే గలడు- ఎచ్చోటజూచిన నచ్చోటనే కృష్ణుడు- గాన్పించుచున్నాడు. ఎట్లీతని సమీపింతును.

కృ—గర్వపరిహారమైనదా! నీవద్దకే నరుదెంచి- నన్ను సమీపింపగల సూక్ష్మదేహ మిచ్చెదనుండుము.

కంసు—అక్కడనుంటివా (రెండడుగులు నడచి కృష్ణుని బట్టుకొనపోయి క్రిందపడును).

కృ— క్షమపడకుము. నీయవసానము సమీపించినది- యింక ముందైన నిట్టి యకృత్యముల నొనరింపకుండుటకై నిన్ను వధించెద. (అని యాతనివక్షముపై గూరుచుండి వధించి) ఇంక తాబోవు మహాభారతయుద్ధమున పెక్కురు దుర్మార్గుల కూల్చి నాయవతారమును సమాప్తినొందించెద. (నిష్క్రమించును.)

తెరవ్రాలును.





శ్రీ

# సంగీత విష్ణులీలలు,



## బుద్ధావతారము.



పాలసముద్రము

[ఇంద్రుఁడు- బ్రహ్మ శివుఁడు- నారదుఁడు- మునులు యుండగా తెఱలేచును.]

అందఱు —(25)

[శ్రీమహావిష్ణువు శేషునిపై శయనించియుండును.
లక్ష్మి పాదములొత్తుచుండును]

శ్రీమ— సురపుంగవులారా! మానిజనశేఖరులారా! చింతాక్రాంత హృదయులరై యున్నట్లు జూపట్టుచుంటిరేల?

నార— లోకరక్షకా! ఏమనిచెప్ప నింతును. నీవెఱుఁగనిదేమున్నది. అయినను మానోటినుండి వినఁదలచితివి- వినుము త్రిపురాసురుల బాధలకు దేవేంద్రాదులెల్లరును దాళలేకున్నారు-

ఇంద్ర— దేవా! స్వర్ణరజిత యయోమయ నిర్మితములగు నాపురములఁ దమయిచ్చవచ్చినట్లు ద్రిప్పుచు- త్రిపురాసురులు లోకముల నలయించుచున్నారు.

బ్రహ్మ— మహా యోగిపుంగవుడగు మయుని పాపులభించినదనికన్న మిన్నగానున్నారు- వీరల నిప్పట్టున జక్కాడకున్న లోకసంక్షోభము చల్లారునట్లు దోపదు.

శివు—త్రిపురదానవులు వేదమార్గావలంబులగుటచే మాకు దుర్ని రీక్షకులైరి. ఇప్పట్టున మే మొనర్పగల దేమున్నదో గోచుట లేదు.

మునులు— నారాయణా! జగద్రక్షకుండవగు నీవిప్పట్టున నుపేక్షచే సిన లోకములన్నియు భస్మీభూతములగును.

ఇంద్రు—దేవాది దేవా!

సీ. మత్స్యరూపమున సో। మకుదున్మించి యలనాడు
శ్రుతులను గా। పాడినావు
బ్రహ్మ—కూర్మావతారివై। కుధరంబుమూపున
నిడుకొని సుధనుమా। కిచ్చినావు
శివు—కపటసూకరుండవై। కనకాక్షుజక్కాడి
భూదేవినానాడు। బ్రోచినావు
ముని—నారసింహుండవై। క్రూరదానవుజంపి
మూడులోకంబుల। బ్రోచినావు
ముని—వామనరూపివై। బలిబలంబునుమాపి
యమరులగాపాడి। యలరినావు
ఇంద్రు—పరశురాముండవౌచు। వసుధాధిపులదున్మించి
ధరణిభారము మాన్పి। దనరినావు
బ్రహ్మ—రామావతారివై। రావణాదులగూల్చి
యెల్లలోకములను। నేలినావు
శివు—వసుదేవుకుర్రవై। పాపాత్ముడౌకంసు
దున్మించిలోకముల ర। క్షించినావు
ఇం—గీ. పెక్కుమార్లిటు దుష్టుల। నుక్కడంచి
త్రిపురదైత్యులునేడు యీ। రీతిమమ్ము

బాధపెట్టుచుండగాఁ । బరమపురుష
నీకృపాదృష్టి మామీద । నిలుపవేల ?

నార—గీ. కామసంచారమొనరించి । భూమిమీద
బడినతోడనె దేశముల్ । పాడువారి
భస్మమగుచుండె నవలీల । పరమపురుష
యిట్టిపెనువింత గంటిమే । యెచట నైన.

లక్ష్మి—నాథా! ఈరాక్షసాధముల జక్కాడి లోకంబుల జక్కపరుప వలయును.

ఇంద్రు—లక్ష్మీకళత్రా! ఆదానవుల బాధపడలేక మాబోంట్లెల్లరును తల్లడిల్లుచున్నారు.

విష్ణు—మహేంద్రాది బృందారకులారా! త్రిపురంబులవలన లోకములు వ్యాకులపడుట నెఱింగియు సమయమరుదేరకుండుటచే నెఱుఁగనివానిపగిది నూరకుంటిని. కాలవశమున నన్నియు సమకూడెను. మిమ్ములనుబిలచియావిషయమై మీతో బ్రసంగింపవలయుననియే దలచుచుంటిని. ఇంతలోననే మీరరుదెంచిరి. త్రిపురనిర్మాతయగు మయుండు- తపశ్శాలి- అణిమాద్యష్టసిద్ధులఁ బొందినవాఁడు, ఆతఁడు తనయోగమహిమకు- తపశ్శక్తికి తోడ్పాటుగ నీపురత్రితయము నిర్మించెను. అయ్యది కారణంబుగ నీపురంబులకు కామగమనంబు కలిగినది- యింతియెగాక త్రిపురాసురులు వేదమార్గావలంబులు. అట్టియెడ వీరల మట్టుబెట్టుటసాధ్యమని దోచుచున్నది. అస్త్రశస్త్రములు వారల నేమియు జేయజాలవు.

లక్ష్మి—నాథా! అట్లైన యీరాక్షసుల పీడ వదలించుకొనదగు మార్గమే లేదా ?

విష్ణు—ఉన్నది కాని, యాచరించుట కష్టతమము.

నార—కష్టతమమైనను- కార్యసాధనమైనపిదప సుఖంపవచ్చునను యాశతో యుత్సాహముతో నద్దానిని జేసితీరుదును.

విష్ణు—త్రిపురాసురుల సంహరించుటకు ముందు సిద్ధరసకూపములోని యమృతమును హరింపవలయును. లేకున్నచో వారలు నశింపరు.

ఇంద్రుడు—సిద్ధరసమును హరించుటెట్లు ?

విష్ణు—తారకాసురాదులు వేదమార్గముల బాటింతురుగావున గోవుల హింసింపనొల్లరు. నేనును యీనలినోద్భవుండును గోవత్సక రూపములనేగి యాసిద్ధరసకూపమునం బ్రమాదవశమునబడి నట్లుబడి సిద్ధరసమును గ్రోలవలయును.

శివు—సిద్ధరస మంతరించినపిమ్మట వారు సులభసాధ్యులగుదురా!

విష్ణు—అంతమాత్రముననేనా? కష్టతమమింకను ముందున్న దాలింపుడు. తదనంతరంబు నేనా త్రిపురాసురులకు బుద్ధరూపంబున నాస్తికమత ముపదేశించి వేదబాహ్యులగునట్లు జేసెద. వారి భార్యల పాతివ్రత్యమహాత్మ్యముచే వారు మరలజీవింపకుండునట్లు జేయుటకై వారిస్త్రీజనంబులకు మానభంగమొనర్చెదను. ఆపిమ్మట నిరీశ్వరవాదులును నిస్తేజులును యయినపిమ్మట వారల జక్కాడుట సులభము.

శివు—చాల చక్కని యుపాయము.

విష్ణు—ఇంతకే సంతసింపకుడు. వారల రూపుమాపుటకై ధరణిని రథంబుగాం జేసి సూర్యచంద్రుల రథచక్రములుగా జేసి సారధిగ బ్రహ్మను, శరాసనంబుగ మేరువును తూణీరముగ వార్ధితురంగములుగ వేదములనుజేసి రథారూఢుండైన యీశంకరుండు నన్నే బాణముగ బ్రయోగించి యాత్రిపురంబుల నొక్కసారిగా గాల్పవలయును ఫాలలోచనుని నేత్రాగ్నిని నారాయణా

స్త్రమునకు ములికగనిడి పృష్ఠభాగంబున చంద్రికళనిడి యా బాణను ప్రయోగింపవలయును. ఫాలలోచనుని నేత్రాగ్ని లేకున్న పురములు భస్మముగాజాలవు చంద్రికళలేకున్న దానవులు మడియరు ఇంతగ్రంధము నడపినగాని యారక్కసులంత మొందరు

శివు — ఎంతకష్టము.

ఇంద్రు — అయినను ఆచరింపవలసియున్నది.

విష్ణు — కార్యసాధనోపాయ మెఱింగిరి గనుక సాధనకై గడంగుఁడు.

తెరపడును.

## ద్వితీయరంగము.

[తారకాక్షుఁడు కమలాక్షుఁడు విద్యున్మాలి ఉచితాసనములపై నుండగ దెర లేచును.]

విద్యు — సోదరా! తారకాక్షా! ఇంద్రాదులెల్లరును మనల నెల్లను సంహరింపుమని యాశ్రీహరిని వేడుకొన వైకుంఠంబున కేగిరని యింతకుమున్ను వినియుంటిని.

తార — ఇంద్రాదు లగువారెందరుగూడినను మనల నేమిచేయగలరు?

తే. గీ. కదనమొనరింప సర్వజ । గమ్ములొనసి
మచ్చరంబున వచ్చిన । వచ్చుఁగాక
సిద్ధరసకూపమునస । మృద్ధిగా ల
భించు పీయూషముండఁగా । వెఱపదేల?

(తెరలో) దానవసార్వభౌములారా! ఎక్కడినుండియో యొకచక్కని పాడియావరుదెంచి ప్రమాదవశమునబడినట్లు సిద్ధరసకూపంబునందుబడి యమృతమునంతయును గ్రోలివైచెను.

తార— కమలాక్షా ! నీవేగి యాసమాచారమును కనుగొనిరమ్ము.

[కమలాక్షుఁడు నిష్క్రమించి రెండవప్రక్కనుండి ప్రవేశించును.]

కమ—సోదరా ! ఒక్కబిందువైనను మిగులలేదు.

తార—ఆశ్చర్యమాశ్చర్యము.

కమ—మరియొక్క విశేషము—కూపరసముతోఁగూడ గోవంతర్ధానమయినది.

విద్యు— అట్లయిననియ్యది శ్రీహరిమాయాకృత్యమయియుండవచ్చును.

[ప్రవేశము—బుద్ధుఁడు.]

బుద్ధు—తారకాక్షా ! జయము. జయము.

తార— (తనలో) ముఖలక్షణములు పట్టిచూడ రాజకుమారునివలె నున్నాఁడు. వేషభాషలు పరికింప యోగిపుంగవునివలె నున్నాఁడు. (ప్రకాశముగా) అయ్యా తమరెవ్వరో యెరుంగఁజేయుదురా.

బుద్ధు—ఓయీ ! బుద్ధుండను యోగిని.

కమ— తమ యోగప్రభావమున మాసిద్ధరసము హరించిన దెవ్వరో చెప్పుఁడు.

బుద్ధు— యింకెవ్వరు మాయాస్వరూపుఁడగు శ్రీహరియే మిమ్ముమోసగించెను. మీప్రవర్తనలబట్టియే మీకిట్టి యనర్థమరుదెంచె.

తార— వేదచోదితపథంబున నడచు మాప్రవర్తన కేమిలోపము.

బుద్ధు— మీలోపముల మీకు చూపెద వినుఁడు మీరు వెన్నుని దలంపరుగదా.

గీ. విష్ణుచోదితమైనట్టి । వేదచయము
విష్ణుగుణకీర్తనముచేయు । వేదచయము
విష్ణుకైవల్య మొసగెడి । వేదచయము
బోధచేసెడ మార్గాన । పోవనేల.

వేదచోదితమార్గముల చరింపు మండుటచేతనే యిట్టి యిక్కట్లు సంభవించినవి. ఆమాట యటుంచుము. వేదచోదిత యజ్ఞయాగాదు లొనర్చుటకై నోరులేనిజంతువుల వధించుచున్నారే "అహింసాపరమోధర్మః" అనువాక్యమును మరచి వర్తించుట మీకు దగునా? ముందేదో స్వర్గసుఖములభించునని జంతువుల హింసించుచున్నారుగదా? పాపభీతికి జంకికదా యిట్లొనర్చుట? రాక్షసేంద్రా! యిటువినుము స్వర్గసుఖ మెప్పుడో లభించుననుట కల్ల. నరకమున్నదనుట హుళక్కి. నరకమనునది యున్నచో జనులీభూలోకంబున కష్టపడు టెందులకు? జనులుతా మొనర్చిన పాప మీలోకముననే యనుభవించుచుండగా నరకమెందులకు? గాన నరకములేదు. నరకమే లేనిచో స్వర్గమంతకు మున్నే లేదు. మానవుని భూలోక సౌఖ్య జీవనమే స్వర్గము-యింతకు వేరులేదు. కావున మనకువలయు సౌకర్యము లన్నియును చేకూర్చుకొని భోగపరాయణులైయుంట మేలు.

తార—మీరనునది విక్కమునుగా దోచుచున్నది.

బుద్ధు—ఇంక మీచేయు మతిమాలిన పనుల నిరూపించెద చూడుడు. మృతినొందినవాని కేమేమియో ప్రీత్యర్థమున నాబ్దికములు బెట్టుచుందు రేటికి. మీరిచట భోక్తలు కుడచిన వానికి తృప్తికలుగునా? కల్ల! కల్ల! పొరుగూరనున్న మీబంధువునకు భోజనసదుపాయ మమరదని మీరిచట నొక బ్రాహ్మణునకు భోజనమిడిన పొరుగూరనున్న మీబంధువువ కాకలినివర్తియగునా? అట్టులే మీరొనర్చు యాబ్దికక్రియలవలన మృతునికి సంతృప్తికాజాలదు.

తార—అయిన మమ్మిప్పు డేమిచేయమనియెదరు.

బుద్ధు—వేదచోదిత కర్మల విసర్జించి హింసయొనర్పక ముక్తిమార్గ
మును సాధించుటకు యత్నింపుడు.

మువ్వురును—తమపాదములానతమశిష్యులమైతమరుపదేశించినయట్లు
వర్తింపుచు యీమతముమాపురంబుల వ్యాపింపచేయుదుము.

బుద్ధ—అట్లయిన నాతోరండు.

తార—మహాప్రసాదము. (నిష్క్రమింతురు.)

## తృతీయరంగము.

(ప్రవేశము— బుద్ధుడు.)

బుద్ధుడు—తారకాసురాదులదరిజేరి వారికెట్టులో నిరీశ్వరమత ముప
దేశించి వారును-వారిప్రజలును-వేదబాహ్యు లగునట్లొన
రించితిని. వారిభార్యలచెంత కేగి. వారలకుగూడ బౌద్ధమత
ముపదేశించి సంతాన ప్రాప్తికై గౌరీపూజమాని ఋతుస్నాత
లై రావిమొక్కల కౌగలించుకొనవలయునని జెప్పితిని. నా
యందుగల నమ్మకము పెంపున వారట్లొనరింపగలరు. నేనయీ
రావిమొక్కల రూపుదాల్చి వారికి మానభంగమొనరించెద.
పాతివ్రత్యము భస్మీపటలమైన పిమ్మట వీరుగూడ నాథులతో
డనే యంతమొందగలరు. ఇంక నేనేగి తత్ప్రయత్నములో
నుండెద. (నిష్క్రమించును.)

## తురీయరంగము.

[రుద్రుడు రథియైయుండ నిరుపార్శ్వముల మునులు
దేవతలు యిందుండునిలచియుండ తెఱలేచును.]

రు—ఇదే! తారకాసురుల సంహారించుటకై - త్రిపురముల భస్మమొ

నరించుటకై నారాయణాస్త్రమును బ్రయోగించెద. (శరము విడచును.) (తెరలో పెద్దధ్వని)

మునులు—జయము. జయము. (9)

ఇంద్రుడు—అదే శ్రీమహావిష్ణువు బుద్ధావతారరూపంబున నిట్లరుదెంచుచున్నాడు.

[ప్రవేశము – బుద్ధుడు.]

అందఱు—బుద్ధయోగీశ్వరునకు జయ్.

బు—జగదీశ్వరా! భవదీయకరుణాకటాక్షముచే కాదె నీయసురులెల్ల గూలిరి.

రు—ఇయ్యది నీప్రభావమునగాదే! నేనిందు నిమిత్తమాత్రుడనైతి. లీలామానుషవిగ్రహుండవగు నీవు పైనుండి మాచే నిట్లాడించి వినోదించుచుంటివి.

బుద్ధు—ఇంద్రా! లోకకంటకులగు తారకాసురులు తమపురంబులతో గూడ వశించిరి. ఇంక నిచ్చోట గూర్చుండి గతించినదానిని గూర్చి తర్కవితర్కముల జేయుటెందులకు. రండు. మనరాక కెదురుజూచుచున్న యితర పురవాసుల కీశుభవర్తమాన మెఱిగింతము.

(అని నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

గద్యము. ఇది శ్రీ రమారమణ చరణసేవాతత్పర హారితస

గోత్రపవిత్ర మద్దూరివంశ లతాంకూర నరసమాంబా

సోమనార్యపుత్ర శ్రీరామమూర్తి నామధేయ

ప్రణీతంబైన సంగీత విష్ణులీలలు

సర్వమును సంపూర్ణము.

# అనుబంధములు.



### (1) సురటరాగము-ఆటతాళము.

సత్య—ఓహో! - నా - జన్మ ధన్య - మయ్యె॥ నోహో॥

అ॥ ప॥ ఈ విరాట్స్వరూపుసేవ - లభించుటచే॥ నోహో॥

చ॥ 1 వరమునిపాలుని - పావనచరితుని

స్థిరమతిగొలిచెడి - ప్రాప్తిలభించె॥ నోహో॥

2 పతితపావనుని - భక్తపోషణుని

సందర్శనమది - దొరకుటచే॥ నోహో॥

### (2) శంకరాభరణరాగము—ఏకతాళము.

అందఱు—పాహి - పాహి - వరదా!

పాహి - పాహి - ముకుందా! ॥ పాహి॥

1 కరుణగనవె - మనవివినవె - దయనుబ్రోవరే

పరమపురుష - పాపవిమోచన - భక్తసుపోషణరావా॥ పా॥

మునీంద్రివాస - శ్రీరతీ

పాహి - పాహి - కరుణింపవె - సద్దయ॥ పాహి॥

### (3) వ అనుబంధము.

అందఱు—పాహి - భవభంజనా! - పాపవిమోచనా॥ పాహి॥

దేవ—మంధరపర్వతము - మందగతిని

పాదోరాశినిమునిఁగి - పోకుండఁగగావవె॥ పాహి! ॥

రాక్ష—సామీమిముగొల్తుము - మనసారగ

సీ ఏహోమహిమజూపి - యియ్యెడమముగావవె॥ పాహి॥

అందఱు—రావే - దీనదయాకర - మాంపాహి - పాహి

యనివేఁడెడి మామొఱవిని - కనికరమున॥ పాహి॥

(4) కళ్యాణిరాగము — ఆదితాళము.

ఇంద్రి—1 దయజూడుమా - రమాధవా - ఆ...ఆ......దయ॥
సమయంబిదె నీ - యనుగ్రహము మాపైనిల్పంగ॥ దయ॥
2 బలవంతులు యీ - పలలాశినులగుటన్
హరియించిరి పీ - యూషంబయ్యో దిక్కులేదు॥ దయ॥
3 కష్టించిన మా - కష్టమువృథయయ్యెన్
సృష్టిస్థితిలయకారక - చేరిమమ్ము గాపాడుమా॥ దయ॥

(5) లతాంగిరాగము—త్రిపుటతాళము.

బలి — ఈ—లతాంగి తను - సోయగము
శీతాంశుని బురడించును - మది
కెంతో మోదము నించును॥ ఈ॥
చాలసౌఖ్య మొదవున్ - సంతోషము మదిహెచ్చున్॥ ఈ॥
ఈసుధారసంబునకు తోడి - మధురసుధారస పానముజేసెడి
ప్రాప్తిలభించిన - చాలదే - జన్మము ధన్యముగాదే॥ ఈ॥

(6) పూరీకళ్యాణిరాగము—జంపెతాళము.

బలి — లెండు లెండు రండు రండు భండనమున
మొండిసురలను - గుండపిండి - జేయుటకై వడివడి॥ లెండు॥
కరుణింపక - దురమందున - శరణన్నను - సురల బట్టి
పీచమణచి - పీయూషము హరియింపగ - కడుముదమున॥ లెం॥

(7) ధన్యాసిరాగము—ఏకతాళము.

నార—దేవదేవ - వాసుదేవ - శ్రీధవా! ॥దేవ॥
శుభములొసంగి నీ - భక్తుల-గాపాడుము దయతోడుత॥ దేవ॥
సకలనిగమ స- న్నుతగుణశీలా-సాదరమున-మము సాకుము-
నీ మహామహిమజూపి - నిగమాంతక -
వేదవేద్య - నిర్గుణరూపా॥ దేవ॥

(8) 7వ అనుబంధమే పాడవలయును.

(9) భైరవిరాగము—రూపకతాళము.

నారద—జయ - జయ - శ్రీలోలా
జయ - జయ - కరుణాలవాల -
శుభగశీల - సుజనలోలా - ఆ-ఆ। జయ॥
మునిజనమందార - కరుణింపుము మమ్మందఱ
నిఖిలలోకసంవేద్య - నిగమాంతవేద్య॥ జయ॥

(10) జంఝూటిరాగము—ఏకతాళము.

ప్రహ్లా—హరిభజనమే - ముక్తిసాధనము॥ హరి॥
అండపిండబ్రహ్మాండమెల్ల
నిండి వెలిగెండి యా శ్రీహరి॥ హరి॥
చిన్మయరూపుని - సేవలభించిన
మత్సర - మద - మోహమమత లడంచెడి॥ హరి॥

(11) ముఖారిరాగము— ఏకతాళము.

లీలా—నాథా! మనముద్దుసుతుఁడు కాదా?
వానియెడలప్రేమలేదా? దయరాదా? ॥ నాథా॥
తల్లి ప్రాణముగాటక - యిటు తల్లడించుచుంటి
నాయెడలప్రేమలేదా - ననుబట్టిప్రీని
గావరాదా? - దయరాదా? ॥ నాథా॥

(12) శ్రీరాగము—అటతాళము.

లీలా—తగునా యిదితనయా—
నీవంటివానికింతపట్టు॥ తగు॥
హరియనుచును మ్రుక్కు మొగమెఱుగనివానిని గొల్చి
కన్నతండ్రి - తోడ - వైర - మూన - నీకు॥ తగు॥
పర్వులకును ప్ర - త్యక్షదైవము
కన్న - తండ్రి - యనుచు - సెన్నుకుంట॥ తగు॥

(13) ఫీల్వారాగము—ఏకతాళము.

లీలా—ప్రాణేశా! నీవింత - పంతమూనఁగనేల?
పసిబాలుఁడనియైన - భావింపవేల? ॥ ప్రాణే॥
నీమాటవినకున్న - నిముషమందునవాని
బందెపెట్టుమునాథ - వధియింపమాని! ప్రాణే॥
పుత్రదుఃఖముతోడ - బొగులుచుంటినినాథ
పుత్రభిక్షముపెట్టి - ముదమార ననుగావు॥ ప్రాణేశ॥
ముల్లోకములుగెల్చి - వరలు నీప్రజ్ఞ
కెవ్వారు నిల్తురు - యేటికి భయమింక॥ ప్రాణే॥

(14) నిత్యకల్యాణిరాగము—ఏకతాళము.

ప్రహ్లా—దయగనుమా - నీభక్తునియెడ॥ దయ॥
నిత్యకల్యాణమూర్తివైన - యో
నిర్గుణ పరబ్రహ్మమూర్తీ
నీనామమె జపియించితినని
క్రూరహృదయుఁడై - క్రూరసర్పముల
కెఱజేయుచుండె నిర్దయ॥ దయ॥

(15) హంసధ్వనిరాగము—త్రిపుటతాళము.

లీలా—నా మొఱాలింపవా—
ననుదయగనవా? సుతునిఁ బ్రోవలేవా?॥ నా॥
కనికరింపుమనుచు నీ - కాళ్ళంటితిగాదా?
మన్నింపకుంటతగునా? - మనముఱాయిజేయతగనా?

(16) సుకల్యాణిరాగము—ఏకతాళము.

ప్రహ్లా—పతితపావన - భక్తపోషణ
పాహి - పాహి - యని - నీ
పదముల వ్రాలితి- భక్తునిబ్రోవుము॥ పతి॥

చిన్మయరూపా ! స్థిరతభజించెద - చెచ్చెరబ్రోవుము॥ పతి॥
నీనామంబెద దలంచిన ఘోరపాపములు గూలిపోవుగద॥ పతి॥

(17) ఫరజురాగము — ఏకతాళము.

శుక్రు—వలదు దానవేశ్వరా? యీదానమీయవలదు॥ వలదు॥
భూసురుండీతండుగాడూ - వాసుదేవుడితగాడూ
దేవదేవునకు దానమిడ - నీతరమంచెద నెంచితె॥ వల॥
ఆదిపరబ్రహ్మమూర్తి యీ - యవతారంబెత్తెను
నాపల్కులు వినుము యీ దానము మానుము॥
వడుగంచును మది దలంపకు మితండా
యింద్రునిగావంగ బుట్టిన శ్రీహరిజుమ్మీ వలదు॥

(18) బ్యాంపుట్యాను.

పరశు—పనిచేయునో? వృధపోవునో?
గనుగొందును నిలుము దుర్మతీ॥ పని॥
ఖలుడవగుచు నీవు నిటుల కాఱులఱువలాభమే
ఖలమతి - నిలుమింక - గర్వమడచి - గండడంతు॥ ప॥
పరశురాముండనిన నీ - భావమందునేమిగా
దలచినావో - నిలువుమింక - ధైర్యమున్న - దలగబోక॥ పని॥

(19) బేహాగ్ రాగము—ఏకతాళము.

సీత—చంగుచంగుమని పరువిడుచుండెడి యీకు
రంగంబును గనుడీ - గనుడీ - నాథా - గనుడీ॥ చంగు॥
సాకీ—మది,కెంతో ముదముగూర్చెడిక
వింతవింతరంగుల నొప్పారెక
చెంతనున్న హృదయానందమగుక
మిత్ర—దయతోడక - దానినిబట్టక - యత్నముజేయన్
వేడెదమిమ్ముక॥ చంగుచంగు॥

(20) మోహనరాగము—జంపెతాళము.

కావ—ఈజగ - న్మోహనాంగి సొగ
సెంతో రమణీయమై యలరారెగా॥ ఈ॥
అలరారెఁగా - మది - కల - వర పఱచెనుఁగా॥ ఈ॥
లలనామణిగూడిన - సౌఖ్యం బలవడుగా॥ ఈ॥
సోదరి చెప్పిన - శుభలక్షణములు
మోదమునించెర్ - ముగుదనుగాంచెర్॥ ఈ॥

(21) బిళహరిరాగము—ఏకతాళము.

సీత—తపసివనుచు భ్రిమసితిరా। దైత్యాధమ పోపోరా॥
రాముసతిని - నేమటంచు। నీమనమున - నెంచితివో
కాలిలిట్టు లఱచుచున్న। కాలుపోలి కేగుదువిక॥ తప॥

(22) ఘరజురాగము— ఏకతాళము.

యశో— ఈ. బాలుని - మాహాత్మ్య మెఱుగంగ
వశమానె - నెవ్వారికైన। ఈ॥
సర్వలోకంబు లీ - బాలుని వక్త్రములో
గాన్పించుచుండె - నద్భుతమది యేమో॥ ఈ॥
కొడుకంచు నేనెంతో - మఱిమఱి మురిసితిగానీ
యాదిమధ్యాంతరహితుఁడని యెంచనైతి॥ నీబా॥

(23) శంకరాభరణరాగము—ఏకతాళము.

బ్రిహ్మ—తప్పుక్షమియింపుమయ్య। దేవకినందనా మాదు॥ తప్పు॥
నీమహాత్మ్య మెఱుగక - నేరక జేసినట్టి॥ తప్పు॥
పరిపరివిధముల నీ - పదముల నేబట్టి
స్థిరమతిని వేడుకొందు - చెచ్చెఱ నను బ్రోవుమయ్య॥ తప్పు॥
నిన్నెఱుఁగతరమే - నీమాయ తెలియ తరమే
నిఖిలలోకధన్య - నిన్నెన్న నాదుతరమా॥ తప్పు॥

(24) కల్యాణిరాగము—ఏకతాళము.

ఇరువురు—జోహార్ జోహార్ జోహార్

జోహార్ యశోదనందనా! జోహార్ ॥

మహాత్మ నీపదంబులెప్డు - మమతతోడగొల్తుము

కృపామయుండవమా - పతిని మాకువీడుమా॥ జోహా

యెల్ల వేళలందునన్ - నుల్లమలర మిమ్మునే

కల్లగాదు గొల్తుమయ్య - కావుమయ్య ప్రేముడిన్॥ జో॥

(25) హంసధ్వనిరాగము— ఏకతాళము

బ్రహ్మ —మామనోహరా - మమ్ముబ్రోవ్రమన్న

మన్నింపవేల?॥ మా॥

నిఖిలలోకరూపా - నిర్మలాత్మస్వరూపా

నీదయాంరసముజూపి - యాదరమున మా

బాధలుపోవగ ద్రిప్పు - రాసురు బరిమార్పుము॥ మా॥

(26) కల్యాణిరాగము— ఏకతాళము.

మునులు —  9 వ అనుబంధమే పాడవలయును.

